

*to by* : Smt. S. Varalakshmamma

మహానందీశ్వర ఆలయము

ఆంధ్రదేశంలోని పురాణప్రసిద్ధమయిన శైవక్షేత్రాలలో మహానంది ఒకటి. శివరాత్రిపర్వదినమునాడు సాధక బాధకాలన్నోర్చి అనేకులు ఈశ్వరారాధనకు వెళ్తుంటారు. చందన మహారాజా కాలంలో ఒక ఆవు తనంతటతానే పాలు పుట్టలో కార్చుచుండడం, గొల్లకాపరి యజమానుని కోపానికి గురికావడం, యదార్థమును కండ్లారచూచి ఆవును కొట్టబోగా అది బెదిరి, పుట్టమీద కాలూనగా ఆ గుర్తు నిలబడినట్లు గాథ. ఆ గుర్తు యీ నాటికిని గోచరము.

మహానంది మార్గమధ్యంలోని
ఒక అపూర్వమైన వంతెన.

*Photo by* : Sri G. Srinivasa Moorthy



# త్వరలో విడుదల





వాహినీ వారి

# బంగారు పాప



నిర్మాత-దర్శకుడు:
బి.యన్.రెడ్డి











యస్.వి.రంగారావు-జగ్గయ్య
రామశర్మ-కృష్ణకుమారి
జమున నటించినది.






### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా **రు.4-8-0.** అర్ధసంవత్సరపు చందా **రు.2-8-0.** అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువను తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పి. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

**ముఖ్యముగా స్త్రీ**లకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొరకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకే ప్రక్క సిరాతో స్పష్టముగా అక్షరాలతోనే వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును: రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామా మార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు ఖుద్దాను బ్యాంకులపైననే పంపవలెను.

GRIHALAKSHMI

# గృహలక్ష్మి

స్త్రీల ఆరోగ్యసౌభాగ్యములను పెంపొందించుట
కేర్పడిన సచిత్ర మాస పత్రిక


వ్యవస్థాపకులు :

**డాక్టరు కే. యన్. కేసరి**

ఆక్టింగ్ ఎడిటర్

సి, సి. పున్నయ్యా



సంపుటము ౨౮]     మార్చి 1955     [సంచిక ౩

# వి ష య సూ చి క



ముఖచిత్రం :

వాహినివారి 'బంగారుపాపలో' జమున



ము ర ళీ గా న లో లు రు



జయ గృహలక్ష్మీ సఖీ! జయజయ లలితాంధ్ర! మధుర సారస్వతిమా!
జయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!



## జయాపజయాలు

ఆంధ్రలో ఎన్నికల ఫలితాలు ప్రజాస్వామ్యానికి అఖండవిజయాన్ని సమకూర్చినవి.

ఈ సారి ఎన్నికలు మారుమూలలలో సయితము ప్రజలలో నవచైతన్యాన్ని, ప్రజాస్వామ్యవ్యవస్థపై ఆసక్తిని ప్రోత్సహించి, తమయొక్క, తమ రాష్ట్రము యొక్క సర్వతోముఖశాంతి అభ్యుదయాలకు అంతకంటె గత్యంతరము లేదను బాధ్యతా స్వీకరణకు దోహదంచేసినవి.

రాష్ట్ర ప్రభుత్వము ఎన్నికల సందర్భమున ప్రజలలో శాంతి భద్రతలకు ముప్పము రాకూడదని విశ్వప్రయత్నము చేసినను అక్కడక్కడ అమానుష సంఘటనలు జరుగనే జరిగినవి. దానివల్ల ప్రేరేపించిన వారు తమ లక్ష్యసిద్ధిని పొందలేకపోగా పతనంచెందారు.

విజేతలయిన ప్రజాస్వామ్య పక్షాల అభ్యర్థులను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాము; "కాని యిల్లు అలుకగానే పండుగకాదు" అన్నట్లు గత చరిత్రను గుణ

పారంగా కలిగి నిజమైన ప్రజాప్రతినిధులుగా ప్రజాహితాన్ముద్దేశించి వ్యవహరించిననే కాని జాతీయసంస్థలు, ప్రజాస్వామ్య విధానము సుస్థిరముకాలేవు. ఈ సందర్భమున మతా రాజకీయాలు ప్రజాస్వామ్య కూటంలోలేకుండా అడుగంట నిర్మూలించాలని కాంగ్రెస్ అధిష్టానవర్గం ప్రయత్నాని కుపక్రమించడం, కృషికార్ లోక్ పార్టీ కాంగ్రెస్ సంస్థలో విలీనంకావడం శుభసూచకము.

ఈ ఎన్నికల ఫలితాల దృష్ట్యా జాతీయతను, దానిననుసరించిన సమస్యలను, అభివృద్ధి, అభ్యుదయకార్య కలాపాలు అన్యదేశ విధానాల ద్వారా భారతప్రజానీకం నెత్తిన పులమనెంచడం సులభంకాదన్న గుణపాఠం ఒకటి.

రెండవది ప్రజాదరణను సంపాదించకలిగేవి నినాదాలుమాత్రంకావు; అలివిమాలిన ఆశలుకావు. జాతీయశ్రేయస్సును, పురోభివృద్ధిని ఉద్దేశించి ప్రజాసమస్యల నర్థం చేసికొని, వాని పరిష్కారానికి పరస్పర సహకార సద్భావాలతో సమరసమైక్యతల వాతావరణంలో ముందంజ వేసే జాతీయనాయకత్వమే ప్రజాభిమాన, ఆదరణలకు పాత్రమగుతుంది. అదే దేశహితానికి, ప్రజాహితానికి తోడునీడకాగలుగుతుంది.

ఈ సందర్భమున ముఖ్యంగా ఆంధ్ర శాసనసభకు ఎన్నుకోబడిన మహిళాసభ్యురాండ్రను హృదయ పూర్వకంగా అభినందిస్తూ, ఏర్పడనున్న సుస్థిరమైన ఆంధ్ర మంత్రి వర్గంలో విద్య, ఆరోగ్య సంక్షేమంలాంటి శాఖల నిర్వహణ మహిళ నిర్వహించడం వాంఛనీయమని కాంగ్రెస్ అధిష్టానవర్గం, ఎన్నిక అయిన శాసనసభ్యులు ఆలోచించి తగు నిర్ణయములు చేయగలరని ఆశిస్తున్నాము.

## బడ్జెటు అంచనాలు

దేశవ్యాప్తంగా కేంద్రములోను, రాష్ట్రాలలోను ప్రతిపాదించ బడుతున్న బడ్జెటులు కోట్ల రూపాయల లోట్లతో నుంటున్నవి. వానిని భర్తీ చెయ్యడానికి క్రొత్త పన్నులు సయితం ప్రతిపాదనలు జరుగుతున్నవి.

ఈ సందర్భమున అభివృద్ధి కార్యక్రమాలు, ప్రణాళికల నిర్వహణకు ప్రభుత్వానికి ఖర్చుకు సరిపడే ఆదాయం అత్యంతావశ్యకమనేది యదార్థము. అందుకుగాను పన్నులు విధించక తప్పదు. అయితే పన్నులభారం భరించడానికి తగినస్తోమతు

ఎవరికున్నది? - ఎవరు యీ అదనపుపన్నులవలన చితికి పోగల ప్రమాదమున్నది? - యని ఆలోచించి వారు, వీరు అనే విచక్షణలేకుండా శ్రేయోరాజ్యంగా వర్ధిల్లడానికి అనువైనవిగా బడ్జెటులు రూపొందాలి.

ప్రభుత్వము తలపెట్టిన అభివృద్ధి ప్రణాళికల నిర్వహణ సందర్భమున జరిగేవ్యయంలో సాధ్యమైనంతవరకు దుబారాను, దోపిడిని అరికట్టాలి. పూర్వం 'రాజుల సొత్తురాళ్ళపాలు' అనే సామెత వాడుకలోనుండేది. కాని యీనాడు ప్రభుత్వము వ్యయముచేయ తలపెట్టినది ప్రజలసొత్తు; అది ప్రజలశ్రేయోభివృద్ధులకని ఉద్దేశించబడినది. ఆ యుద్దేశలక్ష్యాలు నెరవేరడానికి అధికారులు ప్రజాసామాన్యము చిత్తశుద్ధితో భాధ్యతాయుతంగా కార్య నిర్వహణకు ప్రభుత్వముతో సహకరిస్తే కలుగగల సత్ఫలితాలు అత్యంత ఉత్తమమయినవిగా నుండగలవు.

ప్రస్తుతపరిస్థితులలో దారిద్ర్యం, నిరుద్యోగంలాంటి క్లిష్ట సమస్యలతోనే గిజగిజలాడుతున్న సామాన్య ప్రజానీకం అదనపు పన్నులమూలంగా దైనిక జీవితంలో మరింత క్లిష్టసమస్యల నెదుర్కొనవలసివస్తే పరిణామాలు విషమం కాగలవు.

దేశంలో ఆర్థికదుస్థితి తొలగి, ప్రజలకు చేతినిండా పనియుండి, సగటు ఆదాయం పెరిగి నిత్యావసరాలకు లోటులేకుండా నలుగురితోపాటు జీవించగలిగిననాడు ప్రతి యొక్క భారతీయుడు జాతీయ అభ్యున్నతికి తనంతట తానే సంతోష పూర్వకంగా తోడ్పడవలసి యుండటం సహజం. అది విధ్యుక్త ధర్మం. అట్టిపరిస్థితులు ఏర్పడే లోపుగా కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు దూరాలోచనతో పరిస్థితుల కనుగుణ్యంగా బడ్జెటులను రూపొందించవలసియున్నది.



# శ్రీమతి గుడిపూడి ఇందుమతీదేవి
# తద్విరచిత శతకములు

—o—

శ్రీ వేదము వేంకట కృష్ణశర్మ (విద్వాన్)

సుప్రసిద్ధ పండితవంశమున జనించిన యీసాధ్వీమణి పెక్కుకృతులు రచించి వన్నెకెక్కినది. ఈమె పితామహులగు నరసింహశాస్త్రిగారు ఆనాఁటి యుద్దండ కవి పండిత మండలమున మకుటాయమానుఁడై ప్రకాశించెను. వారి కుమారులు ముప్వురు:— రఘూత్తమశాస్త్రి; నరహర్యక్షరాయశాస్త్రి; సరస్వతీ వరప్రసాదశాస్త్రి. అందు రెండవవాడగు నరహర్యక్షరాయశాస్త్రిగారికిని, ఆయన యర్ధాంగి యగు అనంతలక్ష్మమ్మ (పంతమ్మ) గారికిని ఈ కవయిత్రీ తిలకము ఖర సం॥ర చైత్ర శు ౧౧— (1890) న జన్మించినది. తలితండ్రులకుఁ గలిగిన యాఱుగురలోను ఈమె కడగొట్టు కొమరిత. మొదటియాతఁడు నరసింహ (రెండవ) శాస్త్రి. ఇతఁడు పట్టపరీక్షలో నెగ్గి, రెవిన్యూ ఇన్‌స్పెక్టరుగఁ బనిసేయుచుండి, నలువదైదేండ్లకే కాలధర్మము నొందెను. ఇతఁడును దనసోదరివలెనే విద్వత్కవితాలంకారుఁడు. ఈ నరసింహశాస్త్రి— లంకాదహనము, రామదాసు, జయంతజయపాలము-అను నాటకములకుఁ గృతికర్త.

శ్రీ ఇందుమతీదేవి జనకవంశమువారు మతుకుమల్లి వారు, ఆఱువేల నియోగులు. కాశ్యపగోత్రులు. వీరి పూర్వుల స్వస్థలము వినుకొండ తాలూకాలోని మతుకుమల్లి గ్రామము.

ఈయమ భర్త శ్రీ గుడిపూడి రామరావు, సాధుశీలుఁడు. ఈ యిరువుర దాంపత్య మాదర్శప్రాయమయినది. తన సతీరత్నము సాహితీ సమారాధనమునకు శ్రీరావుగారెంతయు ప్రోత్సాహ మొసంగు రసికావతంసుఁడు. ఆమెయు ఆర్యయోషిద్ధర్మము నవలంభించి నిరంతరము భాషాసేవయు, భర్తృసేవయుఁ జేయుచు, గృహిణీత్వము నిర్వహించునది.

సారస్వత రంగమున, నీమానినీతిలక మొనర్చిన సేవ యనన్యసామాన్యము. పెక్కులు కృతులు రచియించినది. పెక్కు సంస్థలలో మహిళామణుల సారస్వతాభివృద్ధికిఁ జేయఁదగు కార్యములలోఁ బాల్గొన్నది. పెక్కుసభలలో అబలా శిరోమణుల యభ్యుదయమునకుఁ జేయఁదగు సంస్కరణములగూర్చి దీర్ఘోపన్యాసము లొసంగినది. ఈయమ కవితాధార యెంతటి ధారావాహికయో యుపన్యాసములంసయుత మంతటి యనర్గళధోరణిలో సాగిపోవును శ్రోతల నాఁకట్టునవి.

ఇంతకును ఈ మహాసాధ్వీమణి సాంసారిక వ్యాసంగములలో భారతీ చరణారాధనమునకును, యోషిద్గణ సంక్షేమ కార్యనిర్వాహణమునకును అవకాశముం గల్పించుకొని పాటుపడుట కడుంగడు శ్లాఘ్యము.

ఆంధ్రీపుత్రికామణులలో- పుత్రికామణులేయేమి- పుత్రరత్నములోను, దేశాభిమానము, భాషాసేవనము సంఘసంస్కరణాదరణము, గలిగి, తమ జీవితముననే కొన్ని గడియలైన వ్యయింతమను ధారాళగుణము త్యాగదీక్ష లేకుండుట మనకు నిత్యానుభవములు. అట్టిచోదన జీవితమున కవియే పరమార్థముగ భావించు శ్రీ యిందుమతీదేవిగారి యాదర్శము తక్కిన నారీమణులకు అవశ్య మవలంబింపఁదగినవి.

ఈమెగారి షష్టిపూర్తి మహోత్సవ సమయమునఁ జదివిన పద్యపుష్పపంచకమందు ఉత్తమ విద్వత్కవి

తిలకమగు నీమెయుత్తమ స్వభావ మీక్రింది విధమున వర్ణింపబడినది:—

"హాయిగఁ దోఁగు మంద మల
 యానిల మానుచు నున్నమావిపై
స్థాయిరహించి, నూతన వ
 సంత కళామహితోత్సవంబులన్
గోమల కన్నియ ల్వలపు
 గుల్కుచుఁ బాడిన భావగీతిలోఁ
దీయని నీదు కావ్య మహా
 తీవర మందలరారు, సోదరీ!"

"వందలు, వేలు, లక్షలు, భ
 వత్కవితా వనసీమ నందముల్
చిందమ లొల్క భావ రస
 సంపన చిల్క గనంబడు స్మహా
నందముఁ గూర్చు పద్య నవ
 నందన సుందర పుష్పముల్ సదా,
యిందుమతీ! కళాగుణా వ
 తీ, సుమతీ, మధురాంధ్ర భారతీ"

'రాలినవమ్మ, నీమృదు క
 రమ్మున దూగిసలాడు నవ్య ప
త్రాల ముఖాల కమ్మని స
 రస్వతి చిందిన మేలి పల్కు ము
త్యాల సరాల ధారలు సు
 ధామయి నీకవితా సుతా తప
శ్శీలము జాటుచున్నది వి
 శేష పురోమహిళా కళాద్యుతుల్"

"కమ్మని కావ్యగానము జ
 గమ్మునఁ బాడిన యాత్మకూరి మొ
ల్లమ్మను జూడనైతిని గ
 దా యని ఖేదము నందు నాదు చి
త్తమ్ము ముదంబు నందెఁ గవి
 తారస వాహినిలో మహాసభా
సమ్ముఖమందు నిన్నుఁ గనఁ
 జూచుట నోగుడిపూడి సోదరీ"

"ఏ నభిమాన బూని, వచి
 యించుట గాదిది, నీవుఁ జేయుస
మ్మానము మాననీయ మను
 మానము గానము, దీన నున్నత
స్థానము నందకొన్న కవి
 తా దుహితా మణి కన్నతల్లి నీ
వై సది లోకమే యెఱుఁగ
 రా?, కవియిత్రి జయమ్ముఁ గాంచుమా'

ఇంతియగాక యిమ్మహాకవయిత్రీమణిని, పెక్కు విద్యాసంస్థలు సత్కరించి బిరుదము లొసంగినవి. శ్రీ శ్రీపాద, చెళ్లపిళ్ల, కంచనపల్లి వారలు మున్నగు పెద్దలు అసంఖ్యాకులు, యోగ్యతా పత్రము లొసంగిరి. అవన్నియు వ్రాయఁబూనినచో నొక గ్రంథమే యగును. కాన నింతతో నీమె ఘనతం గూర్చి తెలుపుటమాని, కృతుల విమర్శకు మరలుదును.

శ్రీ యిందుమతీదేవిగారన్నియో కృతులు రచియించిరి. అందు దిగువ పేర్కొన్నవి కొన్ని మాత్రమే:—

(1) లక్షణాపరిణయము; (2) అంబరీషవిజయము; (3) రామ కథామంజరి; (4) నర్మదా పురుకుత్సీయ నాటకము; (5) సోదరి; (6) గాంధిపాటలు; (7) మంగళాద్రి నరసింహ శతకము; (8) రాజే

శ్వరీ నక్షత్రమాల; (9) తరుణీశతకము; (10) గోవిలాసము; (11) ఆంజనేయ స్తుతి— ఇందు నాల్గవది నాటకము. పదునొకండవది అముద్రితము.

ఈమె కవితాధార అడ్డంకులులేని నాకతరంగిణీ ప్రవాహవేగమును, పావిత్ర్యమును, ప్రసన్నతను పంతరించుకొని సేవించువారికి నిర్భరానంద మొసంగుచుండును. మృదు మధుర శబ్దజాల సంకలితమై, లలిత శయ్యాసమలంకృతమై దిద్ది తీర్చినట్లు సర్వ సౌభాగ్య సంపన్నమై యొసలారుచుండును. ఈ క్రింది పద్యముం గనుఁడు:—

"కైలాస గహ్వార ఘన సుప్త కేసరుల్
దిక్కు-ద్దోఁపక లేచి, దిశలఁబర్వఁ,
కైలాసగిరి సాను కేలావిహార కి
కిన్నరదంపతులు గగనమున కెగయఁ
కైలాసగిరిపాతు గదలి యూఁగఁగ భీతి
గౌరి గంగాధరుఁ గౌగిలింప
హర్ష విస్మయత దక్షాధ్వరధ్వంసి శి
రంబూఁప, మించి ఫణిరాజు నూఁగ,
ఝల్లుమను ధ్వని ఫాలాక్షు విల్లు ద్రుంచి
ధరణి జను బెండ్లియాడిన ధన్యమూర్తి.
చారుతర కీర్తి శ్రీరామచంద్రమూర్తి
మోదమతితోడ నెపుడు మా సోదరీ స
మాజములఁ బ్రోవవలెనంచు మతి
[నుతింతు"

ఇఁక నీమెగారి గ్రంథములలో రెండు శతకములు, శతకములుగాఁ బేర్కొనఁబడినవి గలవు:- (1) తరుణీ శతకము; (2) మంగళాద్రి నారసింహశతకము. "సోదరీ" యనుపేర నుండునదియు శతకమేమో తెలియవచ్చుటలేదు. ప్రకృతము నాకు లభించిన రెండవ శతకమునుగూర్చి మాత్రమే సమీక్షింతును. "నృసింహా" యను మకుటముతో నిందు 111 కంద పద్యములున్నవి. ఇవి కాక యితరపద్యములు పైఁగా ఐదున్నవి. అన్నియును జాతిరత్నములవంటివి. ఏవో ఒకటిరెండు పద్యములు పోతనగారివానికి అనుకరణములు లేకపోలేదు. కాని విశేషముగాఁ గవయిత్రీమణి భావసంభరితములే.

"మిత్రంబులు సుజనులకుఁ బ
విత్త్వంబులు నఘులతా లవిత్రంబులు"

అను పద్యము, భాగవతములోని:—

"చిత్రంబులు త్రైలోక్యప
విత్రంబులు నఘులతా లవిత్రంబులు"

అను పద్యమునకు అనుకరణము.

తమ మనసుకెక్కిన కవి కవితాధోరణి సామాన్యముగ నెల్లర కుండునదియే. శ్రీనాధుని కవితా ప్రభావము పెద్దనకు మార్గదర్శి యగుట విద్వల్లోక వేద్యము. క్రోధ లోభాత్ముల నీమె నిరసించిన విధము గమనింపఁదగినది:—

"ఘనరోగపీడితులు వఃటి
ధనలోభులు, క్రోధమతులు, దంభా
[కారుల్
గుణహీనులైరి నరులిదె
ఘనమతులను జేసి ప్రోవు ఘననరసింహా"

"ధనలోభమతికి దయయును,
వినయము, త్యాగంబు, స్నేహవిభవం
[బును, నె
మ్మనమున కక్కువ, ధనమే
ఘనమా ? సద్గుణము ఘనము శ్రీనర
[సింహా !"

ధర్మ సత్య స్వభావోత్కృష్ట వివరణము:—

"ధర్మమునకె త్రైశంకుడు

ధర్మసుతుఁడు నలుఁడు, రామధరణీశ్వరు [దుర్
నిర్మల కీర్తిధనులు, స
త్కర్ములు, బాధలు సైచిరికద, నర [సింహా!''

''ధృతరాష్ట్రు నగ్రపుత్రుఁడు
హితమతి ధర్మాత్ముఁడైన, నిఁక ధర్మజు [సం
గతియేల? వ్యాసునకు భా
రతరచనావసరమేల? రమ్యనృసింహా''

''సత్యమునకు సంకెలలు న
సత్యమునకు నందలములు సత్యమునుర్వి
సత్యరతుఁడు దివి కేగియు
సత్యము బుధవరులు పొగడ నెగడు [నృసింహా''

కలికాలమహిమ:—

'' ఈయుగపు మహిమ యేమో
మాయోపాయంబు లేక మనలే దెవరున్
మాయోపాయము లేని య
మాయకు వంచింత్రు, దుష్టమతులు [నృసింహా''

''కలికాల మహిమ సతులను
దలప్రంగా సతులె తిట్టఁ దలఁతురు కట్టా!
పలుకం దెలియ నశక్యం
బిల దుష్టుల మానసంబు లీశ నృసింహా!''

వాక్పారుష్య నిరాసము:—

''బిడ్డలయందైనను గడుఁ
జెడ్డఁదనము గలుగువారి సేవింత్రు మదిన్
దొడ్డగ వెఱతురు నోటికిఁ
జెడ్డఁదనము మంచిదేమో? శ్రీనరసింహా''

''అపనిందల మోపి ననుం
గపటముతోఁ జూచి చుల్కఁగను [నెంచిన నీ
చపుఁ గఠినోక్తులు పల్కిన
నెపుడును ఘనశాంతమిమ్ము, యీశ [నృసింహా!''

ఈ కడపటి రెండుపద్యములును బహుశా తన మనస్సును నొప్పించిన యేమహిళామణిని గూర్చియో చెప్పినట్లున్నది. నిశితముగ నాలోచించుచో ఆంధ్ర కవయిత్రుల చరిత్రమును వ్రాసిన శ్రీమతి ఊటుకూరు లక్ష్మీకాంతమ్మగారు, సమకాలికులగు విదుషీమణులఁ గొందఱింగూర్చి వ్రాయుటలో— వారికి సరిపడని సంగతులను గొన్నింటి దడవుటయే కారణము కావచ్చునని నాయూహ. ఇందులకు ఉపబలకముగ శ్రీలక్ష్మీకాంతమ్మగారు తన్నుగూర్చి వ్రాసిన విషయములను లోఁగడ పత్రికలో— శ్రీ వరలక్ష్మమ్మగారు తీవ్రముగ విమర్శించుటయు, ఈయిందుమతీదేవిగారు తమషష్టిపూర్తిసమయ పండితాశీర్వాద సంచికయందు మార్దవముగ మందలించుటయుఁ బాఠకులకు విదితమే. చరిత్రకారు లిట్టి సందర్భములలో సత్యాన్వేషణము కూలంకషముగ జరపుట ఎంతేని అవసరమని నామనవి. భవతు.

శ్రీయిందుమతీదేవిగారి కవిత లాక్షణికమయినను ఒకటిరెండు చోటుల ఛందోభంగము గానవచ్చుచున్నది. రెండవ కూర్పునందయిన వాని సవరించుకొనుట లెస్స.

''నానాథుని సఫలీకృత
మనోరథని జేసిప్రోవుమా, దయతోడన్

ఇందుఁ బ్రథమ చరణాద్యక్షరము గురువు. ద్వితీయమున లఘువు. ఇది లక్షణవిరుద్ధము.

"నిర్మల కీర్తిధనులు స
త్కర్ముల బాధలు సైచిరికద నరసింహా!"

రెండవపాదమున బేసి (ఐదవ) గణము, జగనమో, నలమో యుండదగును:— కందములు అనర్గళముగ దొరలుటలో నిట్టి స్వల్పలోపములు సంభవించుట సహజమగుట, వాని నంతగా పరిగణింపవలసిన పని లేదు. ద్వితీయ ముద్రణమున, అవి సంస్కరించుకొన వచ్చును.

ఇప్పటికే యీసమీక్ష పెద్దదయినది. కాన నడిగినదే తడవుగఁ దమగ్రంథము లంపి తోడ్పడిన శ్రీ యిందుమతీదేవిగారికి నాకృతజ్ఞతానమస్కృతు లర్పించుచు నింతతో ముగింతును.

---

# కేసరి విద్యా సంస్థల వార్షికోత్సవము

ఫిబ్రవరి 25 తేదిన కేసరి హైస్కూలు ఆవరణలో జరిగిన వార్షికోత్సవమునకు మద్రాసు విద్యాశాఖ మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించారు. ఆనాటి ఉత్సవంలో అత్యంతోత్సాహంగా పాల్గొనిన అసంఖ్యాక పురవాసులు, ముఖ్యంగా కేసరి విద్యాసంస్థవ్యవస్థాపకులు కీ. శే. డాక్టరు కే. యన్. కేసరిగారు లేని కొరతను భర్తీ చేయడానికి వచ్చారన్నట్లు వారిసతీమణి శ్రీమతి మాధవి అమ్మగారు ప్రత్యేక ఆసక్తి ఉత్సాహాలతో వచ్చి పాల్గొనడం, ఆనాటి ఉత్సవ కార్యక్రమాలు సమావేశమయిన యావన్మందిని ఆనందపరవశులను చేసినవి.

కేసరి విద్యాసంఘ కోశాధికారి గౌరవనీయులు శ్రీ పత్తిపాటి సత్యనారాయణరావుగారు స్వాగతం చెప్పుచూ ఉమ్మడి మద్రాసు రాష్ట్రమునుండి ఆంధ్రరాష్ట్రము విడిపోయిన తరువాత మద్రాసు నగరంలో నేర్పడిన ప్రత్యేకపరిస్థితుల ఫలితంగా తెలుగు బాలబాలికలకు మాతృభాషలో విద్యావసతులకుగాను ఏర్పడ్డ కేసరి హైస్కూలులో విద్యార్థులసంఖ్య తగ్గుదలగా నుండుటచే దానిని పదిలం చేయడానికిగాను ఆంగ్లమున విద్యాబోధనా వసతులను అభ్యర్థించారు.

విద్యాసంఘ కార్యదర్శి దివాన్ బహదూరు బండి శ్రీహరిరావునాయుడుగారు వార్షిక నివేదికను సమర్పిస్తూ కేసరి విద్యాలయాలఅభ్యుదయ, అభివృద్ధులను వివరించి వాటి స్థాపకులు కీ. శే. కేసరిగారు యిచ్చిన భూరి విరాళములను, విద్యాలయాల అభివృద్ధిపట్ల ఆయన చూపిన ఆసక్తిని నగరంలోని తెలుగు ప్రజానీకం కలకాలము స్మరించి కృతజ్ఞతను వెల్లడించాలనియు, నగరంలో తమ బాలబాలికల విద్యావసతులకుగాను ఏర్పడ్డ యీ విద్యాలయముల అభివృద్ధి, 'అభ్యుదయాలపట్ల నగరంలోని తెలుగువారు భవిష్యత్తులో ప్రత్యేక ఆసక్తితో సహకరించవలసి యున్నదని వివరించారు.

అధ్యక్షత వహించిన మంత్రి కేసరి విద్యాసంస్థల అభ్యుదయ, అభివృద్ధులపట్ల సంతృప్తిని వెల్లడిస్తూ వ్యవస్థాపకులకు జోహారు లర్పించారు.

కేసరి విద్యాలయంలో ఆంగ్లమున విద్యాబోధనావసతుల సమకూర్చుటను గురించి ప్రస్తావించి మద్రాసు నగరం ఏయొక్క భాషావాదుల కూటపు ఆధిపత్యానికి లోబడింది కాదనియు, నగరములోని వివిధ భాషావాదులకు ఏ ప్రాంతాని కా ప్రాంతము కోరితే మాతృభాషలో విద్యాబోధనా సౌకర్యాలు సమకూర్చబడగలవనియు, కేసరి విద్యాలయంలో ఆంగ్లమున విద్యాబోధనకు ఆశించడంకంటె తమిళ, తదితర భాషలలో సయితం విద్యాబోధనావసతులను అమలుపరచడం అందరికీ శ్రేయస్కరమని వక్కాణించారు.

శ్రీమతి మాధవి అమ్మగారు బాలబాలికలకు బహుమతులను పంచిపెట్టి, యింకా నృత్య, గాన, నాటికలలో ప్రావిణ్యము ప్రదర్శించిన కేసరి విద్యాలయముల బాలబాలికలకు బహుమతులివ్వడానికి రు.100 లుయిచ్చిరి

వినోదప్రదర్శనలలో నృత్యములు, నాటికలు మనోజ్ఞంగా నుండినవి. నృత్యప్రదర్శనలు శిక్షణ నొసగిన నటనాచార్యుడు శ్రీ శైవాగారి ప్రతిభ, చాతుర్యాలను చాటినవి.

— పున్నయ్య

---

# ఈశావాస్యోపనిషదు

పూజ్యపాద శ్రీ స్వామీ చిన్మయానందజీ

## ఈ యజ్ఞ మెందుకు?

ఏకొద్ది తెలివిపరులకో, పిచ్చివారికో, మూఢ భక్తులకో తప్ప, మిగతవారిలో, మతమనునది ఒక శాస్త్రవిషయమనిగాని, అది జీవితమున ఒక నిర్వాహకమును పొందియున్నదని కాని తలచువారు కడు అరుదు. ప్రస్తుతము ఉన్నత గోపుర ప్రాకారములలోను, గొప్ప బురుజులలోను కనబడు దురలవాటులను, పిచ్చి నడవడికలను చూచి, మతము ఒట్టి శక్తి రాహిత్య విషయము — దానివల్ల మనకుండు భ్రమ ముదిరి ఉన్మాదముకూడ కలుగగలదు అను అపవాదములు నిజముగా నుండవచ్చును. అజ్ఞానులును, అంధులును అగు మతావలంభకులు, మతములనగా కేవలం పూజాక్రమములని నిర్ణయించి, ప్రాణరహితముచేసి యున్నారు. గుణరహితులు, శక్తిహీనులు అయినవారిచేతిలో మతము స్వాధీనమై, మానవ జన్మరాసినే దుర్మార్గ నడవడికలలో నడిపించగల దుష్టసాధనమై, అసత్య నమ్మకములు, పిచ్చి భ్రమలు, ద్వేషజనిత అహంకారములతో నిండియున్నది.

కాని, ఒక నిజమైన మతము, ఒట్టి నమ్మక విషయమా లేక అది ఒక శాస్త్రమా? మతమునగా ఒక భయంకర శస్త్ర సమ్మేళనమా లేక ఒక శాంతి ఆదేశమా! భగవంతుని వెదకుట ఒక మోసకృత్యమా లేక ప్రేమావేశమా? మహాపురుషుల వాక్యములు విషస్వరూపములా, అమృత స్వరూపములా? దయాదానములతోకూడిన జీవితము మోసకృత్యమా లేక జీవిత పోషణమా?

ఈ విషయములు విమర్శించి, ఒక నిశ్చయార్థక భావము పొందుటకే మనము నేడు ఈ జ్ఞానయజ్ఞ సమావేశమయియున్నాము. ఇచ్చట హిందూ మతముయొక్క బైబుల్ అనగల ఉపనిషదుల ప్రాముఖ్యత, వాటి యందలి సూక్ష్మాంశములను కనుగొనగలము. ఈ 21 దినముల విద్యా ప్రచార కాలమున మనము ఈశావాస్యోపనిషదు నందలి శ్లోక శ్లోకమును వ్యాఖ్యానము చేయగలము. ఇందలి మూలమంత్రములను నిష్పక్షముగా విమర్శించి తెలుసుకొన ప్రయత్నించెదము. ఈ కాలములో మతమునందు, శ్రుతుల యందు అనేక సంశయములు మనసున తట్టుచుండును. మన జీవిత ఆదుర్దాలో మునిగియుండుటవల్ల, శ్రుతుల సృష్టికర్తలనుండి, మనము పొందగల సహాయము లేశమైన యున్నదా, అందువల్ల మన జీవితము ఉన్నతము గాంచగలదా, ఈ కర్తలు, దివ్యపురుషులా, దైవములా, దైవపురుషులా లేక కేవలం మర్త్య వేదాంతులా అని విచారించు నిదానము మనకు లేకున్నది.

ప్రతి ఆరామశాలయందు, క్రీడాభవనములయందు, బహిరంగ సభలలోను, విశ్వవిద్యాలయ భాండాగారములలోను, మతి ఇతర ప్రాముఖ్యతగల జ్ఞాన వర్గ్యులలో, సభలలోను మనము కొన్ని సంశయములను వినగలుగుచున్నాము. ఇవి తీవ్ర ఆందోళన కలిగించు, అంతర విమర్శ పలుపగల ప్రశ్నలుగా నున్నవి. "శ్రుతులనంతయు భస్మము జేయవలసినదేనా, లేక శ్రుతులు చిరంజీవులుగా నుండవలెనా! శ్రుతులు జీవించి యుండగలవా?" ఈ ప్రశ్నల

కంతయు తగు సమాధానము పొందుటకుగాను, పావన శ్రుతులయందు ఈ ఈశావాస్యోపనిషదు అను గ్రంథము వందల భావములను, మర్మములను తీవ్ర విమర్శచే గమనించగలము.

ఈ యజ్ఞకాల పర్యంతము, మీరు దయజూపగల కార్యమొకటి యున్నది. నేను విశేష గుణసంపన్నుడను; ఉన్నతపదవియందుండువాడను అని యెంచ కూడదు. నేను గురువునుగాను; మీరు నా శిష్యులుం కారు. ఈ జ్ఞాన భవనమున మన మిరువురము సమాన సమ విద్యార్థులము. సోదర భావముతో ఋషుల యొక్క దివ్యజ్ఞాన సంపదను విమర్శింప నిశ్చయించి యున్నాము. మనము చేయగలిగినదల్ల, సమాన శ్రద్ధా భక్తులతో, సోదరభావముతో, స్నేహిత సహనముతో ఈ జ్ఞానయాత్ర సలుప సమకట్టి యున్నామని తెలియపలెను.

గ్రంథమునందలి మూలమును సమీపించుటకు పూర్వము మహా ఋషులయొక్క ఆలోచనల సిద్ధాంతమును కొంతవరకు తెలుసుకొనుట ఆవశ్యకము. మనము ప్రారంభ సౌకర్యమునకై, మతమువల్ల ప్రపంచము యొక గొప్ప దివ్య సందేశము పొందగలము. మతము అనునదియే పరిపక్వ శాస్త్ర విచారము అని ఒప్పుకొన సమ్మతించెదము. ఇది కేవల భావన మాత్రము. మన విమర్శ జరుగుకొలది ఇట్టి భావము అసత్యమని తేలినయెడల మన తీర్మానములను ప్రపంచమంత బహిరంగ పరిచెదము. అటుగాక అదృష్ట వశమున మతము అను నిది యొక శాస్త్రసమ్మత విచారమనియు, జీవిత గుణసంపదలంతియు అందు వివరింప బడి యున్నదని కనుగొనిన యెడల మనము అట్టి ఉన్నతగుణ భావములను ఆచరణలో ప్రవేశపెట్టి మతముయొక్క నిజభావములను ప్రపంచమునకు బహిరంగముగ చాట ప్రయత్నించెదము.

ఈ జ్ఞాన యజ్ఞమనునది యొక నూతన సంఘ సంస్కార ప్రయత్న సమావేశమేగాని, నూతనముగా యొక మత సిద్ధాంతమును ఏర్పరచి, అందులో సభ్యులందరు అంధకార భక్తిచూపి పసిడిపురుగువలె తమ బంధమును క్రయమిచ్చి సంపాదించుకొను ప్రయత్నముకాదు. కనుక మొదటి మూడు దినములలో ఈ మూల గ్రంథమును అర్థముచేసుకొనుటకు అవశ్యకమగు పరభాషను విశదముచేసుకొనెదము. అటు పిమ్మట మూలగ్రంథమగు ఈశావాస్యోపనిషదును విమర్శింప ప్రారంభించెదము.

మనము ప్రకృతి శాస్త్రమును, మతమునుకూడ గమనించిన రెంటియందును సామాన్య గుణవిశేషము యొకటి కనుగొనుచున్నాను. రెండును రాజ్యమునకు, మానవజన్మరాశికి పరిపూర్ణ జీవిత సౌఖ్యమును సమకూర్చ ప్రయత్నించుచున్నది. మతములయందు ఎంతటి మోటుతనమును, అపరిపూర్ణతయు కలిగి యుండినను ప్రపంచమునగల సర్వమతములును, వాటి వాటి ఉన్నత దశాకాలములయందు తాత్కాలిక జనసముదాయమునకు చక్కని సేవచేసియున్నవని ఒప్పుకొనవలసియున్నది. కాని కాలము జరుగు కొలది ఈ మానవ సంఘములు క్రొత్త సమూహాలుగా అభివృద్ధిగాంచినవి. వాటి జీవిత విషయములు అభివృద్ధిగాంచి అనేక చిక్కులకు పాలైనవి. ఇట్టి విపరీత అభివృద్ధిగాంచిన జనసముదాయమునకు తొలుత ఏర్పడిన మతసమాలోచనలు చక్కని సహాయము చేయజాలకున్నవి.

ప్రకృతి శాస్త్ర విషయమునను, జనసముదాయమునకు అనేక విధముల సహాయపరికరములు సమకూర్చి వర్షతాపములనుండి రక్షించుకొన సదుపాయములు క్రొత్త క్రొత్తగా వెలువడుచునే యున్నవి. మతమున కనుగొనిన సమస్య ఇచ్చటకూడ కనబడుచున్నది. ప్రపంచమున తొట్టతొలుత నాగలిని సృష్టించి మానవకోటికి సౌభాగ్యము కలిగించెను. నేటి కాలమున ఆ వంకర నాగలి సమర్థత తగ్గిపోయినది కనుక ట్రాక్టర్లు, ఫర్టిలైజర్లు, సృష్టి కావలసి వచ్చినవి.

ఇటులనే పూజాక్రమ విధానముతో తృప్తిపడిన పూర్వకాలపు జనసముదాయ మతము నేటి జనసముదాయమునకు సంతృప్తికరముగా సేవజేయజాలకున్నది. ఎటులైననుసరే ప్రకృతి శాస్త్రమును మత

మునుకూడ జనసముదాయమును, రాజ్యమును సేవించుటే ముఖ్య యుద్దేశము కలిగియున్నవి.

కాలము గడచిపోవుచువచ్చెను. అడవిజీవినుండి, సంఘజీవియై జాతీయ ఆశయములు, ఆంతర జాతీయ సమస్యలు, శక్తిపక్షములు, అసంతృప్తికర వ్యవహారములు వీటితో మనుష్యుల సంఖ్య పెరిగి వారి సంఘనీతులు వివిధరీతుల వ్యాపించి, వారి కోరికలు అనేక రీతుల ఏర్పడెను. చరిత్రయందలి ఇట్టి అమోఘ పర్యవసాన సమయమున కాలము అను ఆవరణమున రాజ్యము, మతము అను కన్యతోకూడి పుణ్యయాత్ర ప్రారంభించెను. కాని చరిత్ర మధ్యతరముల కాలములో యంత్రముల శక్తిప్రాబల్యముతో కూడిన కాలమున ప్రకృతి శాస్త్రము అను మరియొక సౌందర్యవతి ప్రౌఢ ఈ యాత్ర గోష్ఠిలో కలుసుకొనెను. ఆమెకూడ ఈ రాజ్యమునకు సహాయము చేయవలెనను అభిప్రాయమునే కలిగియుండెను. కాని ప్రాచీనకన్య మతము అను దేవి విసుగుతో ఈర్ష్యతో భరించలేక వెనుక ఆగిపోయెను. ప్రకృతి శాస్త్రము మాత్రము ప్రపంచ నడక గావించుచుండెను. కనుకనే మతము దేవాలయముల ప్రాకారములలో, చర్చిలలో మసీదులవద్ద మాత్రము గుమికూడి యుండుట చూచుచున్నాము. మానవ సమాజము ఆటంబాంబులు చేత పట్టుకొని పార్లమెంటు సభలలో చర్చించి నూతనముగ జయించగల రాజ్యములేవైన యున్నవాయని తర్కించుచు బాహ్యప్రపంచమున తమ చమటలు కష్టములు దారబోయుచు ఆంతర హృదయమున నూతన దుఃఖరాజ్యములు ఏలుచున్నవి.

నిష్ప్రయోజన సంచారములతో శాంతము, నిర్మలత్వము అను ఆశను వదలుకొని అలసిపోయి శక్తిహీనమై ఈ ప్రపంచము అను ముసలిరాజు పశ్చాత్తాపముతో నిరాశతో తన ముసలి సతీమణియగు "మతమును" వెనుకకు మరలిచూచుచు ఆమె ఒడియందైన కొంచెము విశ్రాంతి, శాంతి పొందగోరుచున్నాడు. కాని పాపము ఆ ముసలి "మతము" సమీపమున ఎక్కడను అగుపడుటలేదు. దూరమున ఒక కొండ శిఖరమువలె "మతము" దృష్టికి మాత్రము గోచరమగుచున్నది. ప్రాచీనమునకును, నవీనమునకును, గల దూరపు తారతమ్యమువలన ఆ మతము ఒక ముక్కవలె దూరమున అగుపడుచున్నది.

ఈ దూరపు తారతమ్యమువల్లనే మనము సత మతములోని దివ్యకళలకు అపరచితులమయి యున్నాము. ఏదో కొందరు మనలో ఆ మతమును సాహసముతో చేరగలుగుచున్నామనిన వారికి అందున్నదంతయు సారహీనమైన మధ్యతరకాలపు క్షీణించి శిథిలమైన మతమే వారికి దొరకుచుండునది. వ్యాస భగవానుని ప్రాచీనకాలమునకు వెనుక మతము ఎంత మాత్రమును మన దేశములో అభివృద్ధిగాంచలేదు. దానికి యేకొద్దియో శక్తికలిగియుండినదనిన, అది యంతయు మూఢభక్తి, మూఢ విశ్వాసము ప్రబలియుండుటవల్ల మన ప్రయత్నమంతయు మూలస్థానము నుండి నేరుగా పరిశుద్ధముగా సత్యమతమును కనుగొనుటయందు నెలకొనియున్నది. అనగా పురాణ కర్తలకు ఏశక్తి సహాయముకలిగియుండెనో ఆ శక్తినే కనుగొనవలెనని మన ప్రయత్నము. ఈ ప్రయత్నమునందు నాతోకూడ ప్రయత్నించి నడవగలిగిన ప్రాచీన జ్ఞానసన్నిధిని చేరి శ్రద్ధాభక్తి ధైర్యములతో ఆమె దర్శనము గాంచగలమని నమ్ముచున్నాను.

ఉపనిషదులను మూల గ్రంథములద్వారా అధ్యయనముచేయగల అవకాశము నాకు దొరికియుండెను. నేను అధ్యయనముచేయు కాలములో వాటి పవిత్రత యందు నాకు ఎట్టి భక్తి యుండినదికాదు, ఎట్టి ద్వేషమును యుండినదికాదు. నిర్మల మనసుతో ఒక కోరికలేక ఒక లాభము అపేక్షించక వాటి సన్నిధి చేరితిని. ఒక అన్వేషణుని భావముతో వాటిని చదివి వాటి సత్యములను జీవితమున అనుసరించితిని. కేవల భక్తి విశ్వాసమువల్లకాదు - నాయొక్క పరిశ్రమ ఫలముగా మహా ఋషులయొక్క కొన్ని రీతుల భావములను నేను కనుగొంటిని. వారి ఆలోచనా విధానమును వారి మానసవృత్తి, వారు జీవిత సమస్యల

యందు చూపు ప్రయత్న విధానములు గమనించ గలిగితిని. వీరు ఇట్టి గొప్ప శాస్త్రజ్ఞులు, జీవిత స్వరూపమును శ్రద్ధతోను విషయ తారతమ్యములు లేక తర్కనీతి ననుసరణగా విమర్శించి తమ అనుభవములను సత్యవాక్యములుగా ప్రకటించినట్లు ప్రకృతి శాస్త్రవిచారమున ఎట్టి గొప్ప శాస్త్రజ్ఞుడుగాని ఇది వరకు విమర్శించియుండలేదు. ప్రకృతి శాస్త్రజ్ఞులకు విషయ ప్రపంచమంతయు విచార రంగ సామగ్రిగా సమకూడినట్లు, ఈ ఋషులకు జీవితము దాని స్వరూపమే వారికి విచారమునకు, పరిశీలనకు రంగముగా దొరికియుండెను.

ఒక శాస్త్రజ్ఞునికి ఒక లవణము యొక్క నమూన మీద ఒక విధమైన స్వార్థమమకారము గలిగినవెనుక ఆలవణమును భస్మము చేయ సమ్మతించడు. దాని స్వరూపము నిర్ణయించుట నెరవేర్చజాలను. దానిని భస్మము చేయడు. నీటిలోకరుగనీయడు. అటులనే, జీవితము దాని స్వరూపమునందు యొక విధమైన మమకారము కలిగిన యెడల దానియందు అసత్యవిలువలు చేర్చగలవు. అందువల్ల మన దృష్టియే చలించి మందగిలుచున్నది. అందు కొరకు పూర్వపు మహఋషులు జీవిత స్వరూపమును పరిశోధింప సత్య సంకల్పము కలిగినవారై, జీవితమునుండి పరమతవేజ్య భావము గలిగియుండిరి. ప్రపంచ సంఘ ఉన్మాదమునకు అల్లకల్లోలములకు దూరముగనున్నవారై జీవిత పూర్ణాంశమును గమనించి, వారి యొక్క తీవ్ర పరిపూర్ణ విచారణకు, విమర్శకు పాత్రముగావించిరి.

వారియొక్క విమర్శ ఫలితముగా వారు కొన్ని ముఖ్యసిద్ధాంతములను స్థాపించిరి. మనము గ్రంథమును అన్వయనము చేయుటకు, పూర్వపువాటిని మనము పూర్తిగ అర్థము చేసుకొనుట ఆవశ్యకము. జీవరాసుల యందలి వివిధ అంతస్థులలోనుండు జీవితముల స్వభావగుణములను, జీవితకార్యములను మొదలు కనుగొని, జీవితమును పదమునకు సమన్వయ అర్థభావమును ఏర్పరచిరి. చాలతీవ్ర విమర్శవలన "జీవితము అనునది నిరంతర, అవిచ్ఛిన్న అనుభవ పరంపరల వరుసక్రమము" అని ప్రకటించగలిగిరి. ఇట్లు ఒక జంతువు యొక్క జీవితమంతయు అది పొందగల భావముల సమూహముగా తేలును. అదేరీతి, మానవుని జీవితము అతని అనుభవముల రాశియని తెలుపబడుచున్నది. ఇట్లు జీవితమును కొల్చగల మానము ఒక అనుభవముగానున్నది. జీవితమంతయు చేరి అనుభవముల రాశిగానున్నది. కనుక, ఒకనిని సఫల జీవితము పొందినవాడు అనగా, అతని అనుభవములలో అనేకములు ఫలవంతముగను, ఆనందదాయకములుగను యుండవలెను. నిరర్థక జీవితము అనగా, అనుభవముల సమూహములో అనేకములు నిష్ఫలవంతముగా నుండవలెను.

ఇట్లు ఈ గొప్పజీవిత పరిశోధనకశాస్త్రజ్ఞులు, వారి యొక్క తీర్మానముల బలమువల్ల, ధైర్యప్రోద్బలము పొందినవారై, మరి సాహస కార్యములు మొదలు పెట్టిరి. ఈ జీవితమునకు మానములేక కొలతపాత్ర అనదగు అనుభవమును విభజించి, మానియందలి అంశములను కనుగొన మొదలిడిరి. నవీనులు విషయ మానము అనబడు ఆటంను శోధించి, దానియందలి అంశములను బహిరంగపరచినట్లు, ఆత్మవిద్యా పరిశోధక శాస్త్రజ్ఞులు, వారి ఏకాగ్రబుద్ధి, దీక్షతవల్ల, ఈ "అనుభవము" అను దానియందలి అంశభాగములను కనుగొన మొదలు పెట్టిరి.

(సశేషము)



# చచ్చిపోయిన మనిషి

'సులోచన'

"అమ్మా! - నాన్న ఏడే!" అన్నాడు చిట్టాడు తల్లి పైటచెంగు పట్టుకొని ప్రేలాడుతూ.

చిట్టాడి తల్లి కాంతమ్మ - భర్త సంగతి కొడుకు అడగ్గానే బావురుమన్నది. గుండెలో దుఃఖపు అల పగిలింది.

రోజులో ఎక్కువ భాగం పిల్లాడు తండ్రినిగురించి ఆప్యాయంగా అడగటమూ, తల్లి భర్త గతిని తలుచుకొని గుండెబాదుకొని ఏడ్వటమూ జరుగుతోంది.

తల్లి ఏడ్పు వినగానే - పిల్లాడు కెవ్వుమన్నాడు - తేలుకుట్టినట్టు. ఆ బుల్లి హృదయానికి తల్లికేదో ఆపద కలిగినట్టు అనిపించింది.

తల్లీ కొడుకుల రోదనతో ఆ ఇల్లు ప్రతిధ్వనించింది. ఇరుగు పొరుగు వాళ్లు ఆ రోదనకు అదిరిపడలేదు-వాళ్లకు తెలుసు రోజూ ఉన్న దేనని. అత్రోవన పోతోన్న బుచ్చిరామయ్య వెంకటనారాయణ భార్య ఏడ్పువిని ఒక్క అడుగు ఇంట్లోకి వేశాడు - ఆమెను కాస్త పలకరించుదామని.

బుచ్చిరామయ్యను చూసి కాంతమ్మ ఏడ్పును కాస్త హెచ్చుస్థాయిలోకి మార్చింది.

"ఊరుకోవే అమ్మాయి! ఏంచేస్తాం? ఎవరికర్మకు ఎవరు బాధ్యులు? కాస్త వెనుకా ముందుగా అంతా వెళ్లేవాళ్లమే. నువ్వు విచారించి లాభంలేదు." అన్నాడు బుచ్చిరామయ్య మామూలు ధోరణిలో.

ఆ మాటలు కాంతమ్మను ఏవిధంగా తృప్తిపరచలేకపోయినై.

"అయితేఅమ్మాయీ! నాకు తెలియక అడుగుతాగానీ, నీకు వెళ్లేప్పుడు ఫలానా చోటుకు వెళుతున్నాను,-ఫలానా అప్పుడు వస్తాను - అని యేం చెప్పలేదూ!" అన్నాడు బుచ్చిరామయ్య కుతూహలంగా అసలు సంగతి తెలుసుకోవాలని.

కాంతమ్మ రెండుసార్లు ముక్కు చీది, ఏడ్పు తగ్గించి తనకు వాస్తవంగా తెలిసింది చెప్పేందుకు ఉపక్రమించింది.

"లేదు అన్నయ్యా! మొన్న బుధవారంనాడు పదిగంటలకల్లా భోంచేసి - కొత్త గుడ్డలు ధరించారు. ఎక్కడికో ప్రయాణమై వెళ్లుతున్నారనుకొన్నాను. తల దువ్వుకున్న తరువాత ఇనుప భోషాణం తెరిచారు. రెండు పది రూపాయల కట్టల్ని లోపలి జేబులో వేసుకున్నారు. వ్యాపార విషయమై ఎక్కడికో వెళుతున్నారు

కామోసు అనుకున్నాను. సంచి చేతపట్టుకొని బయలుదేరగానే అడిగాను-

"ఎక్కడికండి వెళుతూంట" అని

"బెజవాడ వెళుతున్నాను. సరుకు ఎత్తించాలి. బహుశా రెండురోజులకుగాని రాను. ఇల్లు జాగ్రత్త. పిల్లవాడు బజారుకు వెళుతూంటాడు-జాగ్రత్తగా కనిపెట్టుకొని ఉండు -" అన్నారు అని కాంతమ్మ బావురుమంది.

"ఏడవకు అమ్మాయి - చెప్పు" అని మళ్లీ బుచ్చిరామయ్య అన్నమీదట కొంచెం సేపటికి సంబాళించుకొని మళ్లీ చెప్పనారంభించింది కాంతమ్మ.

"వారికి అబ్బాయంటే ఎక్కడిలేని ప్రేమ. చూడకుండా క్షణం ఉండలేరు- ఎక్కడకు వెళ్లినా, ఏంచేసినా ప్రాణమంతా అబ్బాయి మీదనే ఉంటుంది"

"ఊఁ! తరువాత" అన్నాడు బుచ్చిరామయ్య, కథ సాగి పోవాలని.

"నాలుగు రోజులవరకూ రాలేదు. నాకు మనస్సులో బిక్కు బిక్కు మంటూనే ఉంది. అబ్బాయిని చూడకుండా ఉండలేరు. ఎంత తీరని పనులున్నా - కనీసం ఒక్కపూట తీరిక చేసుకునైనా యింటికి వచ్చి వెళ్లేవారే! ఒకవేళ అక్కడినుంచి మరేదైనా ఊరు వెళ్లారేమోనను కున్నాను. ఇంకేముంది? అయిదో రోజు పిడుగులాగ వచ్చిపడింది. ఆ ఉత్తరం చూసుకొని గుండె బద్దలు కొట్టుకున్నాను." మళ్లీ కాంతమ్మకు దుఃఖం పొంగుకొచ్చింది.

బుచ్చిరామయ్య కొంచెం సేపు ఓపిక పట్టాడు - కాంతమ్మకు ఆ దుఃఖపు పొంగు సద్దుమణిగేవరకూ.

"ఆ ఉత్తరం - చూసుకొని ప్రక్కింటి నరసింహారావు వాళ్లు అక్కడికి వెళ్లారు." అన్నది కాంతమ్మ చీదుకుంటూ

♦ ♦ ♦

"నరసింహారావ్ ?"

బజార్కు వెళ్లే నరసింహారావు వెనుకనుంచి ఎవరో పిలిచినట్టు వినపడగానే ఆగి వెనక్కు తిరిగి చూశాడు.

వెంకటరావు, స్నేహితుడు - వడిగా, కలుసుకోవాలని వస్తున్నాడు. దగ్గరకు రాగానే -

"ఏంరా ?" అన్నాడు నరసింహారావు

"ఇట్లారా, హోటల్లో కూర్చుందాం" అన్నాడు వెంకటరావు.

"నాకు కాస్త పనిఉంది. మళ్లీ కలుసుకుందాంలే" తప్పించుకోవాలని చూచాడు నరసింహారావు.

"నీతో మాట్లాడాల్సినపని ఉందిరా"

అని హోటల్లోకి లాక్కెళ్లాడు వెంకటరావు నరసింహారావుని.

"ఏమిటి.?"

"ఏంలేదు? వెంకటనారాయణ విషయమే! నీకు ఎంతవరకు తెలుసో - అంతవరకూ నేను తెలుసుకోవాలని -"

'నాకు ప్రత్యేకంగా ఎక్కువ ఏం తెలుసు? ఆ రోజు వెంకటనారాయణ భార్య గొలున ఏడిస్తే ఇంటిప్రక్కవాడ్ని ఏంజరిగిందోనని వెళ్లాను. ఆ ఉత్తరం చూడటంతో నాకూ క్రింద మీదు అయింది.'

"అందులో ఏముంది?" అన్నాడు వెంకటరావు.

"వెంకట నారాయణుని ఎవరో రైలు క్రిందికి తోశారు, డబ్బులాక్కొని - చని పోయాడు"

"పాపం. ఎవరురాశారు, ఆఉత్తరం? ఎట్లా రాశేరు?"

"అదే అంతుబట్టకుండా ఉంది. సరైన అడ్రసుకే వచ్చింది."

"మీరు వెళ్లారుగా, అక్కడికి?"

"అవును- నేను, చెట్టుక్రింద వెంకయ్యా, కరణంగారూ కలిసి వెళ్లాం. ఆ చుట్టు ప్రక్కల ఊళ్లన్నీ విచారించాం. కాని అటువంటి సంఘటన ఏమీ సంవత్సరంగా జరుగలేదని చెప్పారు. అక్కడికి గవర్నమెంటు హాస్పెటల్సుకూడా వెతికే వొచ్చాం. వెంకటనారాయణ ఆచూకీ దొరకనేలేదు."

"మరి, అయితే - ఏమైనట్లు?"

"భగవంతుడికే తెలియాలి!"

"ఆత్మహత్య ఏమైనా చేసుకున్నాడేమో!" సందేహంగా అన్నాడు వెంకటరావు

"అబ్బే! అటువంటి అఘాయిత్యం తల పెట్టడానికి వచ్చిన కష్టం ఏముంది? వ్యాపారంలో లాభాలు బాగానే వస్తున్నాయి. సంసారంలో చిక్కులుకూడా ఏమీలేవు. అప్పు అసలేదు. అటువంటప్పుడు ఆత్మహత్య చేసుకోవాల్సిన అవసరం ఏముంటుంది?"

"నిజమే" చిన్నబుచ్చుకొన్నాడు వెంకటరావు తను తప్పుడుగా అంచనా వేసినందుకు.

"అయితే, నీ ఉద్దేశ్యం ఏమిటి వెంకటనారాయణ చావు విషయంలో" అన్నాడు వెంకటరావు మెల్లిగా.

"నాకు ఎటువంటి ఉద్దేశ్యమూ లేదు అతన్ని గురించి ఒక ఉద్దేశ్యాన్ని ఏర్పరచుకొనే దుకు - అతని అంతరంగికాన్ని యెరిగి ఉండాల. అతని ఆంతరంగిక మిత్రుడైన శివరామయ్యకు తెలుసు - అతని

అంతరంగికాన్ని గురించి. వాళ్లిద్దరూ ఒకళ్ల రహస్యాన్ని ఒకళ్ళు - హృదయాన్ని యిచ్చిపుచ్చుకొని చెప్పుకుంటారు." అన్నాడు నరసింహారావు.

♦ ♦ ♦

శివరామయ్య అదోరకంగా ఉంటూ వొస్తున్నాడు. ముఖ్యస్నేహితుడైన వెంకట నారాయణ అకాలమరణం - అతనిని చాల రకాలైన భయాలకే కాకుండా, మానసిక వ్యధకు కూడా గురి చేసింది. వెంకట నారాయణ సహృదయుడు. నిజంగా ఒకళ్ల జోలికీ పోయే మనిషి కాదు. అటువంటి వానికి - అటువంటి దుర్గతి సంభవించిందంటే: ఎవరి హృదయం తల్లడిల్లదు?

ఆ సాయంత్రం లైబ్రరీ అరుగుమీద ఏకాంతంగా కూర్చునుంటే - శివరామయ్యను షావుకారు వెంకట సుబ్బయ్య అడిగాడు.

"ఏం రా! శివరామయ్యా - మరీ విచిత్రంగా ఉంది, మీ వెంకటనారాయణ విషయం"

'మీ' అనటంలోగల బాంధవ్యానికి శివరామయ్య త్రుళ్లి పడ్డాడు. వెంకట నారాయణ తనకు ప్రాణస్నేహితుడు, ఆప్త మిత్రుడు అని అనటంలో - అతని మరణం యొక్క రహస్యం తెలిసి ఉంటుందనే నమ్మకంతోనే నేనని బెదురుతున్నాడు, శివరామయ్య.

వెంకట సుబ్బయ్య వంక కొంచెం ఆశ్చర్యంగా చూసి "అవును, మామా!" అన్నాడు శివరామయ్య.

శివరామయ్య ఆ విధంగా చెప్పడంతో సమాధానం చెప్పటం వెంకట సుబ్బయ్యకు నచ్చలేదు.

"అదేమిట్రా - నువ్వుకూడా అట్లా అంటావు? వెంకట నారాయణ విషయంలో నువ్వూ, నేనూ ఒకటేనా?"

శివరామయ్య అదుగంటా క్రుంగిపోయాడు. ఇదేదో తన తలమీదకే తెస్తున్నాడు, షావుకారు అనుకున్నాడు.

"కాకనాకు ఎక్కువ తెలిసింది ఏముంది? అతని భార్యకు ఎంత తెలుసో నాకు అంతే తెలుసు. అతను భార్యతో ఎక్కడికి వెళుతున్నానని చెప్పాడో - నాతో కూడా అక్కడికే వెళుతున్నానని చెప్పాడు. నాకు అంతకంటె, ఒక్క రవ్వంత కూడా ఎక్కువ తెలీదు. నిజం నువ్వు ఏమన్నా అనుకో మామా! రేపు వెళతాడనగా ఆ సాయంత్రం అన్నాడు: 'రేపు ఉదయం బెజవాడ వెళతానురా, సరుకు ఎత్తించాలి. రెండు మూడు రోజులకుగానీ రాను. మా ఇంటికి అప్పుడప్పుడూ వస్తూ వుండు" అన్నాడు. అంతే! తరువాత

వారం రోజులకు కాబోలు ఆ ఉత్తరం చూసి తల్లక్రిందులైనానని తనకు తెలిసిన విషయం కుండ బ్రద్దలు కొట్టినట్టు చెప్పాడు, శివరామయ్య.

షావుకారు వెంకట సుబ్బయ్య కొంచెం సేపు ఆలోచించి, అన్నాడు –

"అయితే, శివరామయ్యా నీకు తెలిసినంతవరకు వెంకటనారాయణకు ఏమన్నా దుర్గుణాలు ఉన్నాయా? "

ఈ ప్రశ్నకు శివరామయ్య చలించాడు. ఆ మార్పు షావుకారు వెంకట సుబ్బయ్య గ్రహించి మళ్లీ అన్నాడు–

"చెప్పు భయపడతావేం? అతను లేడుగా మనలో మనం చెప్పుకోవటానికేం? ఫరవాలేదు. చెప్పు."

మౌనంగా ఉన్నాడు శివరామయ్య. ఆ మౌనం – వెంకట సుబ్బయ్యకు మరీ అవకాశాన్ని కల్పించింది, రెట్టించి అడిగేందుకు.

"చెప్పవేం! నువ్వు ఇవాళ దాస్తే మటుకు దాగుతుందా! రేపైనా ఆకుల్లేదో బయటపడితే నలుగురూ నిన్నే అంటారు."

శివరామయ్య జాలిగా వెంకటసుబ్బయ్య వంక చూశాడు. 'వెంకటసుబ్బయ్య ఫరవాలేదు చెప్పు' అన్నట్లు చిరునవ్వు నవ్వాడు.

"వేరే దుర్గుణాలు ఏంలేవు మామా! పడమటి బజారు చివర వేపచెట్టు లేదూ– ఆ చెట్టు క్రింద తాటాకుల ఇంట్లో వీరమ్మ ఉంది చూశావూ, దాని కూతురుతో సంబంధం ఉంది. – అంతే–ఆ ఒక్క దుర్గుణం మినహాయిస్తే వెంకటనారాయణలో – మరేమీ చెడు ప్రవర్తన లేదు." అన్నాడు శివరామయ్య తనకు తెలిసింది ఆ ఒక్క విషయమే నన్నట్లు; మొదలకుండా వూరుకున్నాడు.

"ఆమె పేరేమిటి?"

"రాజమ్మ"

"ఆమె కేమన్నా తెలుసేమో"

"ఏమో" చప్పరించాడు శివరామయ్య.

♦ ♦ ♦

"ఏమే! - నిన్నే అడిగేది! నీకేమన్నా తెలిస్తే చెప్పవే?" అన్నది వీరమ్మ దీనంగా.

రాజమ్మకు ముల్లు గుచ్చుకున్నట్టు అయింది.

"ఏమిటి?" ఏమీ ఎరుగనట్టు తల్లిని ప్రశ్నించింది.

"ఆ వెంకట నారాయణ సంగతే!"

రాజమ్మ హృదయం చెదిరింది. ముఖంలో అలజడి స్పష్టమయింది.

"నాకేం తెలుసు! నాకూ ప్రత్యేకంగా ఎక్కువ ఏం తెలీదు"

"ఆ తెలిసిందేదో చెప్పు" కూతుర్ని నిగ్గదీసింది వీరమ్మ. తన కూతురుకు ఆ విషయం గట్టిగా తెలిసి వుంటుందనే నమ్మకం ఆవిడకు లేకపోయినా–ఏమన్నా తెలిక

పోతుందా అనే ఉద్దేశ్యపడింది.

"వ్యాపారపు పనిమీద బెజవాడ వెళు తున్నాను. రెండు మూడు రోజులవరకూ రావటానికి పడదేమో అనిచెప్పారు. అంతే! అంతకు మించినాకేమీ తెలీదు" అని కంటతడి పెట్టింది రాజమ్మ.

వీరమ్మకు కూడా దుఃఖం ఆగిందికాదు.

"అసలు ఇంతకూ నిజం ఏమిటి? వెంకటనారాయణగారు చచ్చినట్లా? లేక ఎక్కడో ఒకచోట బ్రతికే ఉన్నట్టా" అన్నది వీరమ్మ ఏంతోచక.

"ఆ సంగతి ఆయనగారికే తెలియాలి." అన్నది రాజమ్మ.

◆ ◆ ◆

తను ఇప్పుడు ఎక్కడున్నాడు?-

ఎక్కడున్నాడు?

అబ్బా...ఏమిటీ బాధ? చేతుల్నిండా రక్తపు మరకలే! ముఖం, తల, కళ్లూ అంతా నెత్తురు చారలే! అబ్బా...అమ్మో! నొప్పి ..తను ఎక్కడున్నాడు? లేవలేడేం? బాధ, బలహీనత! చుట్టూ ఆచెట్లేమిటి? ఆ గడ్డిదుబ్బులేమిటి? తను ఇక్కడికి ఎట్లా వూడి పడ్డాడు! ఇది భూలోకమేనా? ఆ కొండ, దట్టమైన చెట్టు - ఈ అద్వాన్నపు అడివిలోకి తనెట్లా వచ్చాడు? తనకు తెలీదు! వ్యాపారపు పనిమీద విజయవాడ బయలుదేరడం ... అవును! జ్ఞాపకానికి వొస్తోంది. విజయవాడ బయలుదేరడం-రైల్లో ఆమెను చూడటం.... ఎవరామె? ఏదీ...ఇక్కడ లేదేం? మోసంచేసింది! డబ్బు...డబ్బు! ఖాళీ జేబు - రెండువేల రూపాయలు ఎవరోదొంగలించారు! వాళ్ళు-ఆయు ప్రక్కనున్న ఇద్దరు మనుష్యులు! తనని యీ నిర్మానుష్యమైన అడవిలోకొట్టి డబ్బులాక్కెళ్లారు. అంతేకంటు ఆమెకు తన మీద ప్రేమలేదు. అంతానటన! డబ్బు కోసం ఎత్తులు - తను గమనించలేక పోయాడు. ఆమె అవయవసౌష్ఠవానికే, ఆ చూపుల్లోని అద్భుతానికి, కవ్వింపుకు-మతి చెడగొట్టుకొని, కుక్కలాగ వెంట పడ్డాడు. వాళ్ల మాటలు నమ్మి వూళ్లు, పొలాలు, చెట్లు, చేమలు అన్నీ దాటి చివరకు ఇక్కడకు చేరుకున్నాడు. వెను కనుంచి తన నెత్తిమీద రాయిపడ్డాక తనకు స్పృహలేదు. పిల్లవాడు, భార్య తననిగురించి ఎట్లా దుఃఖిస్తున్నారో! తను వెంటనే ఇంటికి వెళ్లాలి? ఎట్లా? ఆకలి వేస్తోంది. దాహం నీళ్లు ఎక్కడ? ముందు లేచి నిలబడటం ఎట్లా?

వెంకట నారాయణ లేవటానికి ప్రయత్నిస్తున్నాడు. వ్రేళ్లు భూమిమీద సరిగ్గా ఆనటంలేదు. కాళ్లుపట్టు తప్పిపోతున్నాయి. చివరకు ఎల్లాగోలేచి నిలబడ్డాడు. కొంచెం దూరంలో చిన్న చెరువులాంటిది అగపడ్డది. మెల్లగా అక్కడకు వెళ్లి నీళ్లు త్రాగాడు;

ప్రాణంకాస్త కుదుటపడ్డది. కాని ఆకలి తీరలేదు. మెల్లగా ఆ విధంగానే బాధతో, నడిచి ఒక పల్లెటూరు చేరుకున్నాడు ఆ రాత్రి.

వెంకట నారాయణ చచ్చి పోలేదు. అతను జీవించాడు. కాని అతను చచ్చి పోయిన మనిషిక్రింద లోకం జమకట్టింది.

ఆ రోజు రాత్రి నానా అవస్థలూపడి తన వూరు చేరుకున్నాడు. దాదాపు అర్ధ రాత్రివేళ – నడిచి ఇల్లు చేరుకున్నాడు. తలుపు కొట్టాడు.

జవాబు లేదు.

మళ్లీ కొట్టాడు. లోపల ఏదో శబ్ద మైంది. కాని స్పష్టమైన జవాబులేదు. తలుపు మళ్లీ గట్టిగా కొట్టాడు.

"ఎవరు?" లోపల్నుంచి జవాబు.

"నేనే! తలుపుతీయి" అన్నాడు వెంకట నారాయణ.

కొంచెం సేపు నిశ్శబ్దం. తరువాత తలుపు తెరవబడింది. వెంకట నారాయణ లోపలకు వచ్చాడు. బాగా పెరిగినగడ్డం, రేగిన జుట్టూ, చిరిగి పోయిన గుడ్డలూ – మనిషి భీకరంగా, కలలో అవుపించే రాక్షస విగ్రహంలాగ ఉన్నాడు.

లైటు వెల్తురు పెద్దది చేసింది కాంతమ్మ.

"నేనేకాంతం!" రెండు చేతులు ముందుకు చాపాడు, వెంకటనారాయణ.

వీరు! వారేనా .. వారేనా! కాదు! కా.. దు! చచ్చి – కలలో యీరూపంలో అగుపిస్తున్నారు! కలలో తనని ఎవరో తలుపుతట్టి పిలిచారు! తనుకలకంటోంది.... ఆ రూపం ఏమిటి? చచ్చి ఇట్లా భూతం రూపంలో తయారయ్యారా?

"అమ్మో!" కెవ్వున కేక వేసింది కాంతమ్మ.

—o—

# పాంచాలి

శ్రీమతి పెరుమాళ్ల సత్యవతి

అహల్యా ద్రౌపదీ తారా తారా మండోదరీ
పంచకన్య పరేన్నిత్యం సర్వపాప నివారణం॥

అని మా నారీ లోకం ప్రతి నిత్యమూ నిద్రలేవగనే పఠిస్తున్న పంచ మహా పతివ్రతలలో ద్రౌపది ఒకతె.

పాంచాల దేశపు (యిప్పటి పంజాబు) రాజ కుమారి అగుటచే పాంచాలి అనీ ద్రుపదస్య అపత్యం పుమ్యాయితి ద్రౌపదీ (ద్రుపదుని కుమార్తె అగుటచే ద్రౌపది) అని యీమెకు పేర్లు - కృష్ణ - కృష్ణవర్ణ అని మహాభారతంలో వేదవ్యాసుని వర్ణనలను బట్టి యీమె నలుపురంగు దేహఛాయ గలదని రుజువగుచున్నది. నల్లని—వారిలో కూడ గొప్ప స్ఫురద్రూపులు ఉందురనీ: సౌందర్యానికి కారణం దేహఛాయగాక లావణ్యమే (Lustre) ననీ ద్రౌపదీదేవి అపురూప సౌందర్యం ప్రపంచానికి చాటుతూంది - ఎంత రూపవతిగాకపోతే యీమెను చేబట్టటానికి - నానా దేశ రాజకుమారులు ద్రుపదుని మత్స్య యంత్ర నియమాలకు బద్ధులయి ప్రయాసపడుతారు - తుదకు బ్రాహ్మణ వేషంలో ఉన్న అర్జునునకు భార్య అయినదని అంత యీసు వెలిబుచ్చారు. ఇంతేగాక సైంధవుడు, కీచకుడు యీసాధ్వీ సౌందర్య పిపాసలో మాన ప్రాణాల్ని కోల్పోయారు.

ఈమెకు పంచపతులు కల్గుటకు కారణం, గత జన్మలో దాంపత్య సుఖం కోసం కలువరిస్తూ తపించి తపించి భగవత్సాక్షాత్కారముకాగా భర్త భర్త భర్త భర్త భర్త అని అయిదు పర్యాయాలు పల్కినదనీ, ఆరవ సారిగూడ "భ"అని ఉపక్రమింపబోయినట్లు - ఆ కారాణంచేత పంచ భర్తృక అయిందనీ, ఆరవసారిగూడ అనబోయిన కారణంగా యీమెకు కర్ణునిమీద కూడ మనసులో మక్కువయుండేది అనీ అంటారు. ఏది ఎలాగున్నా యీమె కామాతుర అని తెలుస్తుంది. శ్రీ కృష్ణభగవానుడు పాండవుల అరణ్యవాస సమయంలో వీరి వీరి మనోభావములు వీరిచేత

(* పంచనామ)

పలికించుటకై ఒక మాయా చూత్ ఫలం కాల్పిస్తాడు. మీమనోగత భావాలు చేపుతేనేగాని అది మీకు అందదు అని చెపుతాడు — అందరూ తమతమ ఉద్దేశ్యాలు చెపుతారు. ద్రౌపది "భ్రాతరం, పితరంచాపి మాతరం, శ్వసురం తథా యోనిర్ధ్రివతి నారీణాం తథ్యంమే బ్రూహి కేశవ" అంటుంది తన మనోగత కామాతుర భావాన్ని నారీలోకానికంతా అంటగట్టుతుంది.

స్త్రీవ్యక్తులలో అరుదుగా కన్పించే చాకచక్యం- మాటకారితనం - తత్రాపి హేతువాదస్ఫూర్తి యీమెలో ప్రశంసనీయాలు; అపూర్వ ప్రతిభావంతురాలు

మాయాజ్యూతంలో పాండవుల ఓటమి - సుయోధనుని అక్రమచర్య - ఏకవస్త్రగా యున్న పాంచాలిని సభకు రమ్మని వర్తమానము - యివి యీమెను యెంతో కలంచివేసినై. అటువంటి దీన స్థితిలోకూడ చలించలేదు. ఎన్నో సంవత్సరాలు హైకోర్టు వకీలుగా యున్నమహావ్యక్తినిమించి చాతుర్యంగా వాదించింది.

"నన్నోడి తన్నోడెనా లేక తన్నోడి నన్నోడెనా యీ ధర్మరాజుగారు? — ముందుగా తానే పందెములో తనంతట తనను ఒడ్డుకొని ఓడినపుడు - కౌరవుల బానిసగా అయి తన సర్వహక్కులు కోల్పోయినపుడు యిక ద్రౌపది పట్ల తనకేమీ హక్కు లేదే! ఆమెను పందెములో ఘణముగా ఎలా ఒడ్డగలడు? యిది చెల్లని విషయం - అదీగాకుండా తాను (ద్రౌపది) ధర్మరాజుకు ఒక్కనికే భార్యగాదే - యింకా నలుగురు పతులున్నారు. అటువంటపుడు అయిదుగురి - సొత్తును తానొక్కడు యెలా ఒడ్డగలడు?"

యీ ప్రశ్నల్లో యెంత "లా" ఉందో చూడండి. పాండవులను యుద్ధమునకు ప్రోత్సహించినది కూడ

యీమే. ఏదో - ఒకటి రెండు ఊళ్లయినాసరే తీసుకొని శాంతంగా కాలక్షేపం చేదామనే భావంతో తమతమ అభిప్రాయాలను చెప్పుతారు మాతగా వెళ్లనున్న కృష్ణభగవానునితో పంచపాండవులు. తోక త్రొక్కిన త్రాచులాలేస్తుంది ద్రౌపది - పాపం, అవమాన ప్రజ్వలితాగ్ని ఆకాశానికంటుకుంది ఆమె మానస పథంలో. - "మీకుపౌరుషము - పరాక్రమము లేకపోతే యింట్లో కూర్చోండి మాతోడికోడండ్రు హిడింబి, సుభద్ర - మా కుమార వర్గంతో మేము యుద్ధం చేయగలం" అని ఉద్రేకంగా క్రోధాన్ని తెల్పుతుంది. సుక్షత్రియ యువతికి ఉండే యీ ప్రతీకార చింత శరీరంలోని ప్రతి అణువులోనూ ఉంటుందనే విషయం భారత నారీచరిత్ర రుద్రమదేవి ఝాన్సీ లక్ష్మీబాయి మొ॥ వీర వనితల జీవితాలను చాటుతుంది. చాలామంది అంటారు_18 అక్షౌహిణీల సైన్యం స్వల్పకాలంలో నశించిందంటే అర్జునిడి పరాక్రమంకాదు _ భీముడిగదా ఘాతంకాదు - అసలు ద్రౌపది మహాశక్తి రాత్రి సమయాల్లో తన నిజస్వరూపంతో బయలుదేరి ప్రతిపక్ష సైన్యాన్ని నాశనం చేస్తూండేదిఅని.

యుద్ధం అయిపోయింది. కౌరవ సైన్యంలో రథత్రయం - అశ్వత్థామ - కృపాచార్యుడు _ కృతవర్మ యీముగ్గురు మాత్రం తొడలు విరిగి కొన ఊపిరితో ఉన్న దుర్యోధనుణ్ణి ఊరడిస్తారు. తన తండ్రిని అన్యాయంగా పాండవులు చంపివేశారనే క్రోధంతో అపాండవం చేసి తీరుతానూ_యీ రాజ్యం వాళ్లకు కూడ దక్కదు అంటూ ఉద్రిక్తుడై అశ్వత్థామ లేచాడు. అశ్వత్థామ శక్త్యోపాసకుడు _ ఆనాడు శివ శక్తి చేత ప్రసాదింపబడిన తిరుగులేని వాడిఖడ్గం చేబూని - శక్తి స్వరూపమా అన్నట్లు భీకరంగా ఒక్కసారి ఆ అర్ధరాత్రి సమయంలో పాండవుల డేరాపై పడ్డాడు - సశేషంగా ఉన్న సమస్తసైన్యం ద్రుష్టద్యుమ్నుడు (పాంచాలి అన్నగారు) ఉపపాండవులు (పాంచాలీ కుమారపంచకము) ఆ దారుణాస్త్రానికి గురి అవుతారు.

ఈ ఘట్టంలోని ఉపపాండవుల మృతి యెంత కఠినుడినయినా కరగించేటట్లు వ్రాశాడు తిక్కన మహాశయుడు "బాలుర బావు కర్ణములబట్టి కలంగి చెలంగి నోరువం జాలక.........." అనే పద్యాన్ని నుంచి పాంచాలీ విలాప ఘట్టం కరుణ రసానికి నిలయం - చదువరులు కంటతడి బెట్టకమానరు "వాణ్ణి పట్టి తెచ్చి ముక్కలుగా ఖండించి నీ ప్రతీకార చింత బాయచేస్తాను" అని రౌద్రమూర్తి అయి అర్జునుడు బయలుదేరుతాడు

ఎంత క్రోధం ఉందో అంత మార్దవహృదయా "నేను కడుపుశోకంతో యెంత విలపిస్తున్నానో అలానే ద్రోణి యొ గురుపత్ని యీ దురాత్ముడి మృతికి దుఃఖిస్తుందే" అని సమాధాన పరుస్తూ తానే అర్జుని నివారిస్తుంది.

శిరోమణిని ఊడబెరికి జీవన్మృతుడిగాచేసి వదలివేశారు అశ్వత్థామను.

ఉపపాండవుల మృతి విషయంలో పూర్వ విమర్శకులు యేమీ చెప్పలేదు. ఆధునికులు చరిత్రను ఆధారంగా చేసుకొని కొన్ని సత్యాలు చెపుతున్నారు.

కురుక్షేత్రంలోకి యుద్ధముకు బయలుదేరేముందు యిరు పక్షాలవారు వీలునామాలు వ్రాసుకొన్నారు. యుద్ధంనుంచి బ్రతికి బయటకు వచ్చేదీ జయాపజయాలు యెలా యుండేదీ యెవరు చెప్పగలరు? అందువలన ఆస్తిపాస్తుల సంక్రమణ గూర్చి వీలునామ రాసుకోవడం ఆ కాలపు యుద్ధసమయాల్లో పరిపాటిగావుండేది పాండవులు వ్రాసిన వీలునామాలో తమ రాజ్యముకు యువరాజ్య పట్టాభిషేకం అభిమన్యునికి జరుగునట్లు వ్రాశారు - తమ మేనల్లులకు కాకుండా అభిమన్యునకు యీ యువరాజగిరీ అనేది పంజాబు రాజులకు (ద్రౌపతీదేవి తమ్ములకు) కన్నెర్ర కల్గింగి_అందువలనన కుతంత్రసమగములో గుట్టుగా పద్మవ్యూహ సమయంలో అజ్ఞానుడయిన అభిమన్య కుమారుని ఉసిగొల్పి - అతనికి పద్మవ్యూహము నుంచి తిరిగివచ్చుట తెలియదనే విషయం యెరిగియుండీకూడ, "తర్వాత మేము చూస్తాంగదా"

అని ప్రోత్సహించి పంపారు — పాంచాల రాజులు-పాపం! పసిబాలుడు అభిమన్య కుమారుడు పద్మ వ్యూహంలో ఆహుతి అవడం తలితండ్రులయిన సుభద్రార్జునులు - మేనమామ కృష్ణభగవానుకే గాక పాఠకులకు మనకుకూడా దుఃఖం కల్గిస్తుంది మహా భారతంలో యీ ఘట్టం.

ఈ కుతంత్రాన్ని తెలుసుకొన్న కృష్ణుడు పంజాబు రాజులు తమ మేనల్లుని చంపించి నందుకు గాను, యుద్ధానంతరం ఆఖరు రోజున అశ్వత్థామ శివశక్తి ఆవహితుడై తమగుడారం పైకి వస్తున్నాడనే రహస్యం తనకు తెలిసి తన బావమర్దులు పాండవులను తమ్ముడు సాత్యకి మొ॥ ఆత్మీయులను॥ యిక్కడ ఎందుకు - యివ్వాళ సుఖంగా నిద్రపోదాం - 18 రోజులనుంచి నిదురలేదు యింటికి పోదాం - డేరాల వద్ద మన పంజాబు అన్నయ్యలు ద్రుష్ట ద్యుమ్నుడు మొ॥ వాళ్లు పిల్లలు ఉంటారు - మనం వెళ్లుదాం అంటు వారిని మాత్రం రక్షించడానికి యింటికి తీసుకొని వెళ్లాడు - అర్థరాత్రి సమయంలో అశ్వత్థామవచ్చిడేరాలలో ఉన్న సమస్తప్రాణికోటితో పాటు ఉపపాండవుల్ని - పంజాబు రాజుల్ని (ద్రుష్ట ద్యుమ్నుడు మొ॥ వారిని) కూడ తుద ముట్టించాడు - తన మేనల్లుని వారు చంపించినందుకు గాను - వారిని వారి మేనల్లులను అశ్వత్థామ కసి ధారకు బలిచేశాడు. ప్రతీకార చింతలో కృష్ణ మూర్తి — ఇది చారిత్రక సత్యం - అభిమన్యుడి మృతికి కృష్ణుడు కారణమనే పుక్కిటి పురాణాలు అర్థంలేనివి — ఎవరయినా వాత్సల్య పాత్రుడయిన మేనల్లుని చంపుకుంటారా?- కల్ల.

మహాభారతం కేవలం బాహ్యవిమర్శ చేయడం వెర్రి ద్రౌపదిని గూర్చి యింకా యెన్నో అంత రార్థాలు చెపుతారు - పంచభర్తలు అనేది పంచ ప్రాణములు అనీ ద్రౌపది — ఆత్మస్వరూపం అనీ రకరకాలుగా చెపుతారు. ఏది ఎలాగున్నా ద్రౌపది ఒక ప్రజ్ఞాధురంధరశాలి మహారూపసి - ఉత్తమ యిల్లాలు అనే విషయం చారిత్రకసత్యం.

—o—




# శాశ్వతసమస్య

శ్రీ సి. సి. పున్నయ్య

డాక్టరు రామకృష్ణగారు సంపన్నులు. దానికితోడు మంచి ఆదాయం, పలుకుబడీ యున్నవి ఆయూళ్లో. వాళ్లు నివసిస్తున్నది పెద్ద భవనం. ఇంటిముందు అందమైన పూలతోట, విశాలము ఉన్నవి. డాక్టరు గారి అమ్మాయి సరళకు 7 ఏండ్ల వయస్సుండేది. సాయంకాలము వేళల్లో తోటలో గెంతుతూ పరుగెత్తుతూ ఆడుకుంటుండేవి. ఒక్కతే కూతురయి వేరే సంతానం లేక పోవడంవలన తల్లిదండ్రులు చాల గారాబంగా పెంచుతుండేవారు. డాక్టరుగారు ఎక్కడ తిరిగివచ్చినా సరళకనుపించక పోతే సీతా! ''సరళఏది'' అని అడిగే వాడు.

సరళ బళ్లోకి పోయివచ్చి, బళ్లో దారిన చూచినవి విన్నవి బుల్లి బుల్లి మాటల్లో చెప్తూ తల్లి తండ్రులను సాయంకాలము ఆనంద పరవశులను చేస్తుండేది. మధ్య మధ్య ఏవేవో ప్రశ్నలు వేస్తూ జవాబు చెప్పిందాక గుక్కత్రిప్పుకోనిచ్చేదికాదు.

ఆ రోజున వాళ్లమ్మ సరళకు రెండు బొమ్మలు కొనిపెట్టింది. డాక్టరుగారు సాయంకాలము రాగానే ఆమె పరుగెత్తుకొనివచ్చి "నాన్నా! అమ్మనాకు బొమ్మలు కొనిపెట్టింది – చూపెడ్తానుండు" అంటూ గదిలోకి పారిపోయింది.

"సరళా! ఏమిటాహడావుడి! – నాన్న గారిని కాఫీ త్రాగనివ్వు తర్వాత చూపిద్దు

గాని బొమ్మలను'' అని తల్లి కేక వేసింది.

రామకృష్ణ కోటు విప్పి కుర్చీలో కూర్చొని బూట్సులు విప్పుకుంటు "పోనీ సీతా! కాఫీ పాటికి కాఫీ త్రాగుతూ బొమ్మలు చూస్తాను'' అన్నాడు. ముందున్న టేబిలుమీది కాఫీకప్పుతీసికొని నోటి దగ్గరకు పోనిచ్చేసరికి సరళబొమ్మలతో తయారయింది.

"నాన్నా! బొమ్మలు బాగున్నాయి కదూ - యింకా మంచివి పెద్దబొమ్మ లున్నవి నాన్నా! - అమ్మను కొనిపెట్ట మని అడిగితే అవి వద్దని యివి కొని పెట్టింది'' అన్నది బుంగిమూతిపెట్టి.

"పోనీలేమ్మా! - రేపు మంచివి నీకు కావలసినవాటిని కొనిపెడ్తాలే'' అన్నాడు కాఫీత్రాగుతూనే. సరళ నాన్న ప్రక్కకు చేరింది.

ఒక రోజున సరళ బళ్ళోకివెళ్లి వెంబడే తిరిగి వచ్చింది. ఎందుకని తల్లి అడిగితే వాళ్ల స్కూలు హెడ్మాష్టరు చనిపోయాడని సెలవిచ్చారని చెప్పింది.

డాక్టరుగారు ఊళ్లోపని చూచుకొని యింటికివచ్చేసరికి రాత్రి తొమ్మిదయింది. సాధారణంగా ఆ వేళ కప్పుడే సరళ భోంచేసి పండుకొని నిద్రపోయేది ప్రతి రోజూను. ఆ రోజున మాత్రం తండ్రి రాకకొరకు ఎదురుచూస్తూ కూర్చున్నది.

సీత కాళ్లకు నీళ్లిచ్చి కంచంలో అన్నము వడ్డించింది. రామకృష్ణ కాళ్లు, చేతులు కడుక్కొని తుడుచుకుంటూ వెళ్ళి తువాలు పైనవేసుకొని అన్నంముందు కూర్చున్నాడు.

"ఏం సీతా! సరళ యింకా నిద్ర పోలేదు? - అన్నం తిన్నదా''

"మీ అమ్మాయి సంగతి మీకే తెలియాలి.''

"ఏమమ్మా సరళా! నిద్రరాలేదూ! - ఎందుకలాగ ఏదో రకంగా నున్నావు. ''

"ఏంలేదు నాన్నా!'' అంటూ ప్రక్కన కూర్చొని "నాన్నా నేనొక ప్రశ్న అడుగుతాను జబాబు చెప్తావా'' అన్నది.

"ఏమిటమ్మా! - అంత గొప్ప ప్రశ్న''

"నాన్నా! మనుష్యు లెందుకు చచ్చి పోతారు?''

సీత అందుకొని "ఏమిటా పిచ్చిప్రశ్న- ప్రొద్దుపోయింది-వెళ్లిపండుకో'' అని కసిరింది.

"అలా కసురుతా వెందుకు సీతా! ఏదో అడిగింది.''

"ఈవాళ వాళ్లస్కూలు హెడ్మాష్టరు చచ్చిపోయాడని శలవిచ్చారట అదియీ ప్రశ్నకు మూలం'' దేవుడికి వాళ్లు యిక

భూలోకంలో బ్రతికియుండటం యిష్టం లేక"

"అయితే చనిపోయినవాళ్లు ఎక్కడికి పోతారు?"

"దేవుడి దగ్గరకు"

వెంబడే సరళ "నాన్నా! అయితే చనిపోయిన వాళ్లనుచూచి ఏడుస్తారెందుకూ! - నేను చచ్చిపోతే నీవు ఏడవవు కదూనాన్నా!" అన్నది.

"ఏమిటా పిచ్చిమాటలు! పోయి పండుకో" అని సీత సరళను చెయ్యిపట్టుకొని తీసికొని వెళ్లింది అవతలికి.

వారం రోజులు గడిచాక ఒక రోజున ప్రక్కలోనే ఉదయం సరళ నలతగా కనుపించింది. సీత లేపడానికివెళ్ళి తాకేసరికి సరళఒళ్లు కాగుతుండింది. ఏదో సాధారణమైన జ్వరమేకదాయని తానే మందివ్వ మొదలు పెట్టాడు డాక్టరు రామకృష్ణ. రోజులు గడువసాగినవికాని జ్వరం తగ్గలేదు. మరొక పెద్ద డాక్టరునుపిలిచి చూపించాడు. టైఫాయిడ్ అని నిర్ధారణ అయి చికిత్స ప్రారంభమయింది. రోజులు గడిచినకొద్దీ సరళ నీరసిస్తూ వచ్చిందికాని జ్వరం తగ్గలేదు. తల్లి పాపం! కంట్లో వత్తులేసుకొని రాత్రింపగళ్లు మంచం ప్రక్కనే యుండేది. రామకృష్ణ చేయ తగినదంతా సరళకు జ్వరం తిరుగుమొగం అగుతుందేమోననే ఆశతో చేశాడు. కాని లాభం శూన్యం. పన్నెండవ రోజున ఉదయం శాశ్వతంగా కళ్లు మూసింది. సీత భోరున ఏడ్వసాగింది. రామకృష్ణ ఏడ్వకుండా యుండి యుంటాడా?



శ్రీ రాచకొండ శ్రీహరి

పూర్వులు సౌందర్యంకోసం ప్రాకులాడేవారిని నాగరికులు అనీ రసికులు అనీ అనేవారు. అలంకారికులు వీరికిచ్చిన బిరుదం సుభగులని. సౌభాగ్యం పేరేకదా సౌందర్యం! మనలో సౌభాగ్యవతికి వున్న గౌరవమూ పూజ్యతా మరొకరికి ఉందా? మన పూర్వులు అందపు ఆశ హద్దులేనిది సుమండీ! చూడండీ, నవవైధవ్యంతో నలిగిపోతూవున్న రతీదేవి మన్మథుణ్ణి గురించి అంత దుఃఖంలోనూ-

"అబ్బబ్బ! దేవతలు ఎంత క్రూరులండి — నాకు అలంకారం చేయడం పూర్తయినాకా లేదు — యింతలోనే మిమ్మల్ని పిల్చారు. చూడండీ! యీ ఎడమ కాలు పారాణిలేకుండా అల్లాగేఉంది త్వరగారండి. దీనికి పారాణి పెడుదురుగాని." అంటుంది.

ఇది అందానికి మనవారిచ్చిన స్థానం హద్దులేనిదని చెప్పడంలేదండీ!

## సొమ్ములు

మొగవాళ్ళకంటెకూడ స్త్రీలకే అందం అంటే అత్యాశ అంటారు. మన వాఙ్మయంచూస్తే యీ మాట నిజంగా తోచదు. అందంకోసం ధరించే సొమ్ముల్లో యిద్దరికిన్నీ యే కిరీటం ముక్కురాలాంటి దగ్గరో కొద్దితేడా ఉండొచ్చు. అంతే తక్కిన హారాలు, పతకాలు, వడ్డాణం, కాళ్లా చేతులా కడియాలు, యిత్యాదులన్నీ సమానమే. ఇంతెందుకు? యీ శ్లోకం యెరుగిండే కదండి:

కస్తూరీ తిలకం లలాటఫలకే వక్షస్థలే
కౌస్తుభం ॥
నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం
కరే కంకణం ॥
సర్వాంగే హరిచందనంచ కలయం
కంఠేచ ముక్తావళీం ॥
గోపస్త్రీ పరివేష్టితో విజయతే గోపాల
చూడామణిః ॥

కాబట్టే అందం దిద్దుకోడంలో స్త్రీ పురుష భేదం లేదన్నాను. సత్వోద్రేకం వున్నవాళ్ళందరికీ అందపు ఆశ వుండాలిసిందే. అయినా స్త్రీలు సుకుమార ప్రకృతులు కావడం మూలాన అందపు ఆశా, యత్నమూ, ఓపికా, తీరికా, కొంత హెచ్చుగా వారికి ఉందన్నాకూడ న్యాయమే అనిపిస్తుంది. పూర్వకాలంలో సర్వసాధారణమైన అలంకారం యెలా వుండేదో మనం గమనింతాం.

శ్లో॥ హస్తే లీలాకమలం అలకే బాల
కుందాను విద్ధం
నీతా లోధ్ర ప్రసగ వరజసా పాండు
తామాననేశ్రీః

చూడాంగే నవకురవకం చారుకర్ణేశిరీషం
సీమంతేచత్వదుపగమజం యత్రనీపం వధూనాం.

చేతిలో వయ్యారంగా ఒక కమలం, పాపిడికి రెండు ప్రక్కలా మల్లెల జాలర్లూ, మొగాన లొద్దుగ పుష్పొడిశోభా, కొప్పులో కొత్త గోరింటలు, చెవి యందున దిరిసెనపూవు, పాపిటిలో కడిమి మొగ్గా. యివి అలకానగర స్త్రీల అలంకార సామగ్రులట.

## స్నానాలు

నిజానికి అందందిద్దుకొనేపద్ధతి యిదే అయినా యేకాలంలోనూ నిరాడంబరంగా అలంకరించుకొనేవారు కొందరంటూ వుంటారు.

స్వచ్ఛాంచః స్నపన విధౌత మంగం
ఓష్ఠస్తాంబూలద్యుతి విశదో విలాసినీం,
వాసస్తు ప్రతను వివిక్తం అస్త్వితీయాన్
ఆకల్పోయది కుసుమేసుణా న శూన్యః.

పరిశుభ్రంగావుండే నీళ్ళతో ఆప్యాయనంగా స్నానం, తాంబూలపు ఎరుపుతో తళతళలాడే పెదవి, సన్నని తెల్లని, స్వచ్ఛమైన రవసెల్లా అనే యీ పాటి అలంకార సామగ్రి ఉంటేచాలు మన్మథ సుఖానుభవం పూర్ణంగా పొందవచ్చునని భావం.

హాయీ, స్థాయీ లేకుంటే ఎవరూ దేన్నీ సాధింపలేరు. అందం దిద్దుకోవడములోకూడ యింతే. అందం చేసుకోవడంకానీ, అనుభవించడంకాని ఇల్లూ వళ్లూ మీద ఆధారపడుతుంది. వాత్స్యాయనుడు నాటి నాగరికుని యిల్లు యిలా వర్ణించాడు.

## గృహాలంకరణం

"చక్కని నీటివరుసగలచోట ఉద్యానంతోసహా యిల్లు ముందూ వెనకా రెండు భాగాలుగా ఉండాలి. ముందు యింట్లో తెల్లని స్వచ్ఛమైన పరుపులు పరచిన సోఫాలూ, బల్లలూ, దేవతా ప్రార్థనకై కూర్చొసనం, దాని కెదురుగా ఒక అరుగూ, అరుగుపైన పుటిక, లవంగపుపట్టా, తాంబూలాలున్నూ, చిలకొయ్యకు వీణా, చిత్తరవుపలకా, రంగులభరిణ, కుంచ యేదో ఒక మంచి పుస్తకం, గోరంట మాలికలు, చదరంగపుబల్ల, జూదపు పాచికలు, పెంపుడు పిట్టల పంజరాలు వుండాలి. వెనక యింట్లో తూగుటుయ్యాలలూ మొదలైనవి ఉండాలి."

ఇల్లు యిలాగా రమ్యంగా దిద్దుకొన్న పిమ్మట నాగరీకునికి అతడు పెద్దకార్యక్రమం యిస్తాడు. ప్రతిరోజూ ఉదయం కాలకృత్యాలుతీర్చి కొద్దిగా చందనం పూసుకోవాలి. జుత్తుకు అగరుధూపం, పెదవులకు అలక్తం రంగు, ముఖవాస తాంబూలాదులు సేవించిన పిమ్మటే తక్కిన పనులు చేయాలి.

హాయీ, స్థాయీ ఆనాడు యెంత ప్రధానాలో నిష్ఠా, తిష్ఠాకూడ అంత ప్రధానాలు. వాత్స్యాయనుడు నాటి నాగరీకుని మనువూ నిగనిగా యిచ్చేఫేనకం, నాల్గేసి రోజులకోమాటు ఆయుష్కర్మ్రా, పదేసి దినాలకు ప్రత్యాయుష్యాన్నీ విధిగా చేర్చాడు.

పూర్వం యీ అలంకారంమీద యింత మోజు వుండడంచేత ఆ కాలంలో కొందరు అలంకరించడం వృత్తిగా యేర్పరచుకున్నారని తెలుస్తుంది. ఈ వృత్తిని స్త్రీలే చేసేవారు. వీరిని ప్రసాధికలు, శిల్పకారికలు, సైరంధ్రులు అని ఆ నాడు అనేవారు.

మన పూర్వులు అలంకారం చేసుకొనే రీతులు అనేక విధాలుగ నాడు వుండేవి. ఏ అలంకారానికైనా ముందుగా ఆ భాగాన్ని గంధతైలంరాసి లోధ్ర కల్కంతోనలచి, తేలిగ్గా సిక్థకం అద్ది, మెత్తదనాన్ని నిగనిగనూ ఏర్పరచుకొనేవారు. తడి ఆరేందుకు చక్కని ధపద్రవ్యాలుకూడ ముందే సిద్ధంచేసుకొనేవారు.

ప్రాచీనుల అలంకారాలలో హెచ్చువ్యాప్తిగలది వక్త్రరచన. ఇది చాల ముఖ్యమైనదికూడ. మకరికాదులని వీటికే మరోపేరు; సిందూరం, కుంకుమపువ్వు అభ్రకం, చాయపసుపు, అర్ధళం యిత్యాదు

లను నిర్దుష్టంగా చూర్ణించి, వీటిని ద్రవపదార్థాలతో కలిపి ముఖ్యంగా స్త్రీలు చెక్కిళ్లు, చేతులు, చెవి పందులు, పందిళ్లు మొదలైన ప్రదేశాలలో వింత ఆకారాల తీగలూ పువ్వులూ యేర్పడే రీతిగా చిత్రించుకొని వాటిని విరిసిపోనీ, మాసిపోనీ ధూపాలతో తడిఆర్చేవారు.

## చందన చర్చ

ఇల్లాగే కస్తూరి పసుపు కలిసిన చందనం స్తనాలకు పూసి చనుమొనలకు అగరు రాసుకొనేవారు. ఇది నాటి వారికి చాలా సరదా. చారిత్రకంగాచూస్తే మన అలంకార రచనలో పత్రరచనే ఆద్యాసృష్టిగా తోస్తుంది. పచ్చబొట్లు, రకరకాల బంగారు రత్నాల సొమ్ములూ, యివన్నీ సౌలభ్యంకోసరం శాశ్వతత్వం కొరకు ఏర్పడ్డ మార్పులుగా వుండొచ్చు. పత్రరచన తరువాత పారాణి చాల ప్రాముఖ్యం గడించింది. కాని యీ మధ్యను చిన్నచిన్న అలంకార రచనలు చాల చాల వున్నవి. అందు కొన్ని:—

నల్లని నిగనిగలాడే కాలాంజనంతో కనుబొమ్మలు సొగలు తేలేట్టు దిద్దుకోడం ఒకటి ఇది భ్రూవిలాసాభిజ్ఞతను తెల్పేదిగావుంది. పండ్లకు, పెదవులకు రంగులు వేసుకోవడం, పళ్ళకు నిగనిగ వచ్చేట్టు వరిగింజతో పళ్లుతోమడం, పసుపు నీళ్లతో జలకం, తెల్లావాలు చూర్ణించి ఫేస్ పౌడరుగా వుపయోగించడం రెండోది. ఇది దశనవసనాంగ రాగమనే లలితకళకు నిదర్శనం. చిత్ర విచిత్ర రీతుల మొగమున బొట్టు దిద్దుకోవడం మూడోది. యిదే విశేషచ్ఛేద్యమనే కళ. కళ్ళకు శలాకాంజనంతో కాటుక పెట్టుకోవడం, పెదవులకు తడిఆరని సిద్ధకంతో పవడపుదిగి వచ్చేట్టు అద్దుకోవడం నాల్గోపని. యింకా కర్ణపత్రరచనలూ, పాముకుబుసంలాంటి సోగజడలు అల్లుకోవడం చిత్ర విచిత్రాకృతులు పూవుపెత్తులు ధరించడం స్తనాలు, నూగారువళులు కస్తూరితో దిద్దడం, హారాదులు అనేక తరహాలవి ధరించడం, యిత్యాదులు అనేకం వున్నవి.

ఏదయినా కారణాంతరాలవల్ల సౌందర్యం చెడిపోతే, దాన్ని మళ్లా నిలుపుకొనేందుకు చాల చాల యత్నాలు ఆనాటివారు చేసేవారు. ఎవరయినా ద్రోహబుద్ధితో యితరుల అంగాన్ని చెడగొట్టినా లేక, చెడగొట్టే ప్రయత్నంచేసినా ఆ నాడు న్యాయస్థానంలో అది రుజువైతే అట్టి వారికి ఉత్తమసాహసదండం శిక్షగా విధించవలెనన్నారు అర్థశాస్త్రజ్ఞులు.

## సౌందర్య రక్షణ

చూడండి నాటివారి సౌందర్య రక్షణ దీక్ష యెంతదో! సౌందర్యాన్ని పునస్థాపించుకొనే యత్నాన్నే మనవారు భగంకరణం అనేవారు. యీ క్రింది విషయాలు అందులోనుండి చెపుతున్నాను. తగరకం, (గ్రంధి తగరం) చెంగల్వకోష్ఠు, తాడిశపత్రీ చూర్ణించి, దాంతో అనులేపనం చేసికోవడమున్నా, లేదా ఆ చూర్ణంతో వత్తులుచేసి వెల్గించి ఆ మసిని కాటుకచేసి పెట్టుకోవడమున్నా మనర్నవాసవా, దేవఆకు, శారిబ, గోరింట, కలువపూలు ఆకులువేసి కాచిన తైలంతో అభ్యంజనం చేసికోవడమున్నా లేక వీటి పూవులతో మాలికలుచేసి ధరించడమూ యిత్యాదులన్నీ కనీసపు అందాన్ని నిలుపుకోవడంలో ఆ నాటివారు ఉపయోగించేవారు. వైద్యశాస్త్రంకూడ ఈ విషయాలను యెంతో విస్తరించి చెపుతుంది.

శుక్రపుష్టి, ధాతుబలం పెంపొందించుకోడంకూడా సౌందర్యం కాపాడుకొనే సాధనాల్లోనే చేరుతుంది. కనుకనే పద్మోత్పల నాగకేసరాదులను ఎండించి, చూర్ణంచేసి, నెయ్యీ తేనేచేర్చి లేహ్యముగాచేసి తిన్నాకూడ చెడిపోయిన అందం మరల కుదటబడేదని అంటారు.

ఎన్ని చెప్పేదండీ! ఆనాడు మనవారు సహజమైన యీశ్వర దత్తమయిన, యీ అంగాన్ని పెంపొందింపచేసికోడానికి గానీ, లేదా ఆ అందం కారణాంతరాలవల్ల చెడితే మరల దాన్ని చక్కచేసికోవడానికి గానీ యెంతెంతో శ్రమచేసేవారు. ఒక పరిశ్రమ చెయ్యడమే కాదు. సౌందర్యాన్ని నిలుపుకొన్నారుకూడ.

—o—

# ఇంట్లో గోల

శ్రీ పోలవరపు సుబ్బారావుగారు

ప్రపంచములో ప్రతి పురుషుడు, స్త్రీ బ్రహ్మచర్యము తర్వాత గృహస్థాశ్రమము తీసుకోవలసి యుంటుంది. ప్రతివారికి అనుకూలమైన భార్యలకు అనుకూలమైన భర్తలు, అనుకూలమైన భర్తలకు అనుకూలమైన భార్యలు వస్తారని చెప్పడానికి వీలులేదు. భగవంతుడు అందరికి ఒకలాగు యేర్పాటు చేయడు. ఎందరో, ఎన్నో విధాలుగ వుంటారు. అలాగే ఒక సంసారములో భార్య భర్తలు అనుకూలముగ వుంటే అదే భూలోకస్వర్గంలా వుంటుంది. కానీ అదే వికటిస్తే నరకకూపమని తప్పక చెప్పాలి. మనము జన్మఎత్తక ముందే బ్రహ్మ మానవ జీవితాలనుగురించి వ్రాస్తాడు. అది తప్పించుకోడానికి ఎవ్వరి తరముగాదు. ఎవరికర్మకు తోడు మునుపటి జన్మలోచేసిన పాపపుణ్యాలకి ఫలితంగా కష్టాలని సుఖాలని ఓర్పుతో ఎదుర్కోవాలి. కష్టమువచ్చినపుడు ఏడువటం, సుఖమొస్తే ఎక్కడలేని ఆనందం అనుభవించడం పరిపాటిగాదు. ఒక చిన్న ఉదాహరణ - తల్లిదండ్రులు ముచ్చటగా మూడుముళ్ళు వేస్తారు. వేసివేసేదేతొందర ఏదో ఉద్యోగం వల్ల పరాయివూరిలో కాపురం పెట్టారు. క్రొత్త కాపురంలో భార్యగా అనిపించుకోదగ్గ స్త్రీ భర్తకనుకూలంగావుంటూఆయన అఫీసునుంచివచ్చేసరికి కావలసిన సౌకర్యాలు చూపి, భోజనం చేసి లేచినతర్వాత వారివారి పనులను చూచుకోవాలి. అంటే కుర్రాళ్ళను సముదాయించుకొని యింట్లో పని, పాట చక్కబెట్టుకొని భర్తమనస్సుకు కష్టముకలిగించక వుంటుంటే ఆ సంసారంలో కలతల కలుగక ప్రశాంతంగానే కొనసాగుతుందనడంలో సందేహము లేదు. అలాకాక, వారి భర్తల మనస్సుకు కష్టముకలిగిస్తూ సంసారంలో రహస్యాలు యిరుగుపొరుగు వారికి తెలిసేలాగు చేస్తోంటే ఆసంసారంలో ప్రతి దినము తగవులు తప్పవు. అలా తగాదాలు లేకుండా తిన్నగావుంటే బాగుంటుంది. ఈపై చెప్పినరీతిన స్త్రీలువుండాలి.

ఇక భర్తల విషయాన్నిగూర్చి ఆలోచిద్దాము భార్యలను భర్తలు ఎంత గౌరవముతోచూస్తే వారు అలాగే అంత గౌరవముతో చూస్తారు. సాధ్యమయినంతవరకు మగాళ్లు చెడ్డలవాట్లను మానుకొని యింటికివచ్చేసరికి మనస్సు కులాసాగా వుంచుకోవాలి. అలాకాక చెడ్డలవాట్లవల్ల మనసు చెరచుకొని యింటికొచ్చేసరికి ఏదోకచిన్నతప్పు గనిపెట్టి ఆడాళ్ళమీద దౌర్జన్యంచేస్తూ, వేళకు తిండికిరాక వేయివిధాలుగ కష్టపెడుతూంటారు. ఇలా

చేయడం చెడ్డసావాసమువల్ల. దీనివలన సంసారంలో అశాంతి, మానసికవ్యధ తప్పి సౌభాగ్య ఆనందాలుండవు. రచ్చరగడ మూలంగా ఆ సంసారం సక్రమంగా వుండదు సరికదా, యిరుగు పొరుగున సరివాళ్ళల్లో చెడ్డపేరుతప్పకొస్తుంది. పైవిధముగ చేయడం ఒకఘనతగాదు. సంసారం గుట్టువ్యాధిరట్టు అనేరీతిగామనం తినేతిండి, చేసేపని రహస్యంగా వుండాలి. ఇలా భార్య భర్తలు పరస్పరము ప్రేమతో సంసారంసాగిస్తే అదేసుఖసంసారం అంటారు. గ్రహచారవశాత్తున భార్యకు వళ్ళుసుస్తిగావుండి పనిచేయలేని స్థితిలో వుంటే వారిని వూరకనసతో చీకాకు మాటలతో వేధించక, తగిన మందు మాకు యిప్పించి దాన్నిమనం చేయించే మార్గంచూస్తే అందరు చూసి సంతోషిస్తారు. వీరిలో వారి ప్రేమానురాగాలకు చిహ్నం కానీ వెట్టిచాకిరి చేయించుకొని గ్రహచారంచాలక రోగమో, రొష్పొవస్తే, వెట్టగావదిలేసి పోయేవారు మగజాతికే తీరనికళంకము తెచ్చిన వరౌతారు. యీలాగే గృహిణులు యేగో రోగాలు చాలక రోగంవస్తే వారికిమందు ఇప్పించే దానికి డబ్బులేకుండ ఉన్నవారు కష్టపడి అప్పోసొప్పో చేసి డాక్టరు పీజుచెల్లించి యేలాగోభర్తరోగం నయంజేయిస్తే వారు నిజమైనప్రతివ్రతలు. కాని ఒకమూల భర్త కొంపలో రోగాలతో మూలుగుతూంటే వారు బీచీలకి. సినిమాలకి, కొందరు తిరుగుతూంటారు; అలాంటివారిని నేనెంతో మందినిచూచి యున్నాను. ఇలాచేసేవారికి ముఖ్యంగా ఆడవాళ్ళకు నాపైన కోపమొస్తుందేమోకానీ, యిలా చేసేవారు మగాళ్ళలోగూడ వున్నారు. ఇలాభర్తలను యింట్లోవదిలేసి అటు, యిటూ తిరుగుతూండే వారు వుండడం స్త్రీజాతికి కళంకము. తామియిరువురు ఒకరినొకరు అనుసరిస్తే హాయిగా రోజులు గడుస్తాయి. ముఖ్యంగా యీనియమావళి అవలంభిస్తే మగాళ్ళు ఆడవాళ్ళువల్ల, ఆడవాళ్ళు మగాళ్ళవల్ల, భాధలుపడకుండ సుఖంగావుండగలరు. (1)వివాహానికిముందు యిద్దరి గుణగుణాలు ఒకరివొకరికి తెలీదు కాబట్టి, చేసుకొన్న తర్వాతనైన వొకరి మనస్సునొకరు గమనించి నడుచుకొంటే ఉభయులకూ మంచిది. (2) స్త్రీలకు ముఖ్యంగా ఓర్పు సహజంగా వుంటే వారి గృహంలోశాంతియుంటుంది. మరిమగాళ్లు మొండి భార్యలుగా వుండి చెప్పినమాట వినకుండ వుంటే, సామదాన భేదముల చెప్పిచూసి యిరువురూ కుటుంబ శ్రేయస్సు కుపయోగపడాలి. యిది అంత బాగాలేదు. కొంచెము తెలివిగల వారు ఒకటి రెండుమాటలతోనే ఆలకిస్తారు. (4) గ్రహచారంవల్ల భర్తకు సంపాద్య

యోగ్యత లేకపోతే కొంతమంది ఆడాళ్ళు వారిని వేపుకతిని ప్రతిదినం యింట్లోగోల పెట్టూంటారు. యిలాచేస్తే వారిమనస్సు విసుగు పెట్టడం, దానికి తిరిగి రెండుతిట్లు తిట్టడమో, తన్నడమో చేస్తారు. కానీ అలాంటి సమయంలో వారిమనస్సులకు కలతలు కలిగించకండ వుంటే చాలా మంచిది. యిలాగే కొంతమంది మగాళ్ళు కూడ పల్లెటూళ్లలో వుండేవారిని పెళ్ళి చేసుకొని, ఆయనకి అదృష్టంవల్ల ఏదైన పెద్దపదవో లేక డబ్బో వస్తే వారు యింగ్లీషువారి ఫాషనులో దుస్తులువేసుకొని తమతో బీచికి రమ్మంటారు. అలాంటప్పుడు ఆడాళ్లు వారి లజ్జాసంకోచాలను వెలిబుచ్చి, వినకపోతే వారు ఎదుర మాట్లాడవచ్చు. అయితే యిది, ఎప్పుడూ కాదుసుమా! యిలాంటివి స్త్రీలుపురుషులు గుర్తిస్తే వారు అన్యోన్యదాంపత్యము గడుపకలుగుతారు.






## రాగుల పేలపిండి

తవ్వెడు రాగులను శుభ్రముచేసి నీళ్ళలోపోసి ఒక రాత్రియంతా నాననియ్యవలెను. ఉదయం వడియబోసి ఎర్రగా వేయించిన పేలాలగును. వానిని మెత్తగా విసిరి ఒక డబ్బాలో నుంచుకొని కావలసి నప్పుడు పరిమితంగా ఆ పిండిని ఒక గిన్నెలోకి తీసికొని అందులో తగినంత పంచదార, ఏలకులపొడి, పచ్చి కొబ్బరికోరు, ఒక చంచా నెయ్యి, కొద్దిగా పాలుపోసి బాగా కలిపి తినవచ్చును. ఇది ముఖ్యంగా బాలలకు ప్రతి ఉదయంపెట్టి తినిపించిన మంచి ఆరోగ్యకరముగా నుండును. ఖర్చు సయితం తక్కువ.

యం. ఆర్. సీతమ్మ

## ఎల్ సేరి

పొట్లకాయ ముక్కలు శుభ్రముగాకడిగి ఒక కళాయి గిన్నెలో నుంచుకొనవలెను. అందులో సరి పడ్డనీళ్లు, ఉప్పు, పసుపు, కొద్దిగా యింగువ, కొద్దిగా పచ్చిమిరపకాయల తుంపులు, పచ్చిమిరపకాయలకు బదులుగా ఎండుమిరపకాయల కారమునైనను, వేసి ఉడకబెట్టవలెను. ఆ యుడికిన ముక్కలలో నాలుగైదు గరిటెల ఉడికిన కందిపప్పువేసి బాగా కలియబెట్టి మరికొంతసేపు ఉడికిన తర్వాత దించాలి. ఒక కొబ్బరి చిప్ప తురుమును, కొంచము జీలకర్రను మెత్తగానూరి ముద్దగా నుంచుకొనవలెను. బాణలిని పొయ్యిమీద యుంచి అందులో కొంచమునూనె, ఎండుమిరపకాయ తుంపులు, ఆవాలు జీలకర్ర, మినపప్పు, కరివేపాకు వేసి చిటపటమంటూ సువాసన వచ్చేటప్పుడు నూరిన ముద్దను ఆ పోపులోవేసి గరిటెతో కలియబెట్టుచుండి నచో కొంచముసేపట్లో కొబ్బరి తురుము ఎర్రగామారి నురుగులు గ్రక్కుతూ సువాసనకలిగియుండును. దానినితీసి ఉడికించి యుంచుకున్న పప్పు, పొట్లకాయ మిశ్రమంలోకలిపి కలియబెట్టవలెను.

ఇదే విధంగా బీరకాయ, తియ్యగుమ్మడికాయ, మునగాకు, అరటికాయలాంటి కూరగాయలతో ఎల్ సేరి తయారుచేసికొనవచ్చును. ఇది సువాసనతో రుచికరంగానుండే కేరళదేశీయ అన్నసాధకం.

## మెళుకు పెరటి

ఇది సాధారణంగా మన కూరలాగుంటుంది. అయితే యిదిచేయడం చాల సులభము. మూడు అరటి కాయలు తీసికొని చెక్కుతీసి చిన్న చిన్న ముక్కలుగా తరిగి యుంచుకోవాలి. దీనితోబాటు 5 పలములు పెద్దచిక్కుడుకాయలుగాని, కారామణికాని ముక్కలుచేసి కలిపి శుభ్రముగాకడిగి ఒక కళాయి గిన్నెలో వేసి వానికి సరిపడు ఉప్పు, నీళ్లు, పసుపొడివేసి ఉడికించాలి. ముక్కలు ఉడికిన తర్వాత పళ్లెములోకి తీసి యుంచుకొనవలెను. బాణట్లో 3 పలముల కొబ్బరినూనె పోసి పొయిమీదనుంచి బాగా కాగిన తరువాత ఉడకబెట్టియుంచిన ముక్కలను అందులో పడెయ్యాలి. ఈ మిశ్రమము సన్నని సెగపై నిదానముగా మగ్గ నివ్వాలి. అడుగంటకుండా అప్పుడప్పుడు కలియబెట్టూ యుండాలి. అది ఎంతవేగితే అంత కమ్మగా నుండును. దీనిని వేడిగా నున్నప్పుడే తినవలెను. చల్లారిన తరువాత బాగుండదు, కాబట్టి భోజనాల సమయానికి తయారయిపోయి పొయ్యిదిగేటట్లు అమర్చుకోవలసి యుంటుంది. ఈ కూరంటే మలయాళీలకు- ముఖ్యంగాబాలలకు మహా యిష్టం.

యం: సుశీలాదేవి

# గౌరి ప్రార్థన

శ్రీమతి వంగల వాణీబాయి

---

నిన్ను నమ్మినాను - పరమేశ్వరీ - తల్లి
నిన్నె నమ్మితినమ్మ - శంభురాణి
నీవె కాదటమ్మ-త్రైలోక్య-సుందరీ
ముల్లోకములు మ్రొక్క-ఆదిశక్తి
బ్రహ్మ - ఆదివిష్ణు దేవతలునుకూడ
నిన్నెగాదె - ముందు - మ్రొక్కినారు ?
అట్టి-ఓ-తల్లి పావనీ-శివునిపత్ని
మాటిమాటికి-శిరమ్రొగ్గి - మ్రొక్కు-చున్న
నన్ను వేగిరమెవచ్చి-కాపాడుమో-కల్పవల్లీ ॥
ధగధగ-సుప్రభావళిని-ముజ్జగముల్
ప్రకశింప జేయు-మజ్జననివి
శంభురాణివిని-శీతలవాసిలి
నాదువేల్పు-విఘ్నేశుని-మాతవున్
హరిహరాదులకున్-యిలవేల్పువైన
మాయమ.మల్లికాంబ.మహిషాసురమర్ధని
గౌరి-శంకరీ-పావని-ఎన్నడైన
నిను నమ్మినవారికి-నాశముందునా ?

మల్లిఖార్జునిపత్ని-కనకదుర్గమ్మ
శంకరుని ప్రియదేవి-గౌరి-మాయమ్మ
హైమవంతునిపుత్రి-గిరిజమాతల్లీ
కైలాసనివాసి-మాజనని వల్లీ
నిన్నె నమ్మిన-మాకు-ఎట్టి-ఇడుమలునూ
లేకుండ కాపాడు-కనకవల్లి॥

## "భారతభూమి"

జయ, జయ, జయ, జయ భారతభూమీ
హిందుదేశశుభ - శోభితగాత్రీ
కల్యాణీ-మధురామయి-వాణీ
గోముఖ-గంగా-యమున-తరంగీ
కృష్ణా, గోదావరి-కావే...రి॥జయ, జయ॥
హిమవత్పర్వత-రాజశ్రేణీ
కాళిదాసకవిపుంగవు-భూమీ
జవహర్‌లాల్ మహాత్మాగాంధీ
దేశసేవకుల-జన్మ-స్థానీ ॥జయ, జయ॥
హిందు-మహమ్మదు-సిక్కు-పర్సీ
బౌద్ధ-జైను-మత-మరి-క్రీస్తానీ
భేద-భావ-భయ-నాశనహారీ
జయ-కరుణామయి-భారతభూమీ

॥జయ, జయ॥

—— ——(o) ——

# ఏకోదరులు

రచయిత : గోథేమహాకవి

అనువాదము : డాక్టరు వి. ఎస్. శర్మ

(గతసంచిక తరువాయి)

మరియానా:—ఊఁ! ... వద్దు, వద్దు, ఎన్నటికీవద్దు; అట్టి దురాశలు. నేను వెళ్ళాక ఆయన పోషణను ఎవరు చూచుకొంటారు? ఆయన వర్తకపు విషయాల్ని ఏలా చక్కబెట్టుకొంటారు?... పరాయి పనిమనుష్యులా ఈ ఇంటిని సర్దుకోటం? అది వ్వటికీ సంభవంకాదు.

ఫాబ్రిస్:—నీవే పెండ్లిచేసుకొంటే ఆయిన సంతోషిస్తాడు. నీ భర్త ఆయన్ని ఎంతో ఆప్యాయంగా చూస్తాడు. ... అప్పుడు ముగ్గురూ వుమ్మడిగావుండి అన్ని పనిపాటల్ని నిర్విఘ్నంగా చక్కబెట్టుకోవచ్చు. మీ అన్నయ్యకూ అప్పుడు కొంచెం విశ్రాంతి అనేది వుంటుంది.

మరి:—మగవాళ్లు అలాగే అనుకొంటారు. ... మీ సలహా బాగానేవుంది ... కాని, కాని నా కోరికలు అంత సవ్యంగా ఫలిస్తవని ఏలా చెప్పగలను?

ఫా:—అంటే ... మీరనేది నాకేం అర్థం అవటం లేదు.

మరి:—అలా అడుగుతా రెందుకు? అ! నేనన్నది నిజం. వేకువ జామునే నిద్రనుంచి లేస్తాను. అన్నా అసరికే లేస్తాడు. అప్పట్నుంచి తిరిగి రాత్రి పడుకొ్కనేంతవరకూ పుట్టెడుపని ... వంటగదిలోకి వెళ్ళాలి; నిప్పు చక్కగా మండుతోందా లేదా చూడాలి. నీళ్ళు కాచాలి. తరువాత వంటపనిని ఆరంభించాలి. అన్నయ్యకు నచ్చిన సాధకాల్ని తయారుచేయాలి. ఇంకా ఈ విషయాల్లో ఎంతో బాదరబందీ వుంటుంది. వాటినంతా శ్రద్ధతో, చూచుకోవాలి ... పని మనిషినే పెట్టుకొంటామనుకోండి - ఆవిడ కెందుకు ఉంటుంది యింత శ్రద్ధ? ... అట్టి పరిస్థితుల్లో అన్నయ్య వుక్కిరి బిక్కిరి అయిపోతాడు. ఆ సంగతినీ మీరు ఆలోచించాలి?

ఫా:—ఇంత వోపిక ఎవరికుంటుంది? గృహలక్ష్మి వంటే నీవుతప్ప మరెవ్వరున్నారు మరి?

మరి:—అలా పొగటం నాకేం నచ్చదు. ఒక వంట పనేనా! ఇంటి పనీ అంత సులభమైంగా మరి! పనంటే ఎంతో వుంటుంది. అన్నయ్య లేచివచ్చేటప్పటికి ఆయన బట్టల్ని సరిచెయ్యాలి. ఆయన కచ్చేరిగదిలోకి వచ్చేటప్పటికి అక్కడి వసతుల్ని చక్కబెట్టాలి. అన్నిటినీ చూచుకోవడం సులభమా చెప్పండి? ... అలసిసొలసివుంటే పిచ్చి కోపం వస్తుంది! దాన్నే సరిచేయకపోతే ఆయనచేసే పనంతా మన్నుపాలవుతుంది ... అంత దూరం పోవటమెందుకు? నేను ఇంట్లో లేకపోతినా బండి ఏమాత్రం నడవదు. నేనంటే అన్నయ్యకు ఇష్టం. ఆయన్ని నేనూ కష్టపెడుతూ వుంటాను. అయినా ... నన్ను చూచాక అంతా మరచిపోతాడు.

ఫా: అవునవును ఆ సంగతిని నీవు చెప్పాలా? నీవే ఇంట్లో లేకపోతే తబ్బిబ్బయిపోతాడు. నా కిది తెలియదనుకొన్నావా?

మరి:—అలా చెప్పొద్దండి ... అన్న లేకపోతే నాగతేమైవుంటుందో! ఈ జీవితంలో సౌఖ్యం, ఆనందం అనేది వున్నదంటే ... అంతా అన్న నిరంతరంచూపే వాత్సల్యం వల్లే.

ఫా: ఇట్టి సుగుణకన్యను భర్తకేచేసి వుంటేనో ... అట్టి భర్తే నిజంగా ఈ లోకంలో అదృష్టవంతుడు.

ఆజన్మాంతం ఎంత కృతజ్ఞతను చూపెట్టగలడో నీ వంటి భార్యకు !

మరి:_కథల్లో అట్టి దాంపత్యాన్ని గురించి వింటాం. ... కాని అది కథే. నిజంగా అట్టి దాంపత్యం మానవ మాత్రులకు లభిస్తుందా మరి ?

ఫా:_ఎందుకు యదార్థం కాగూడదు ?

మరి:_నిజమో, మరేదో మనమేలా చెప్పగల్గుతాం? ... ఆ పనిని సాధించటానికి మొట్టమొదట ఆలా నిత్యతృప్తుడయ్యే మానవుణ్ణి కనుగోవాలి. ఆలా కనుగొనే భాగ్యమే అబ్బిందనుకోండి. అట్టివాణ్ణి ఎలా అడిగేది "నీవంటే నాకెంతో ఇష్టం" అని. మరీ ఆ గుక్కతోనే "అన్నయ్యగారూ మీ దగ్గరే వుండనీయాలి. ఆయనకు ఇంతవరకూ చేస్తూవున్న పరిచర్యను ఇకముందుకూడా చేయడానికి మీరు అంగీకరించాలి" అని ఏలా అనగల్గుతాను. ఆలా జరగడం అసంభవం. ఆ సంగతీ మీకూ బాగా తెలుసు. ఏమంటారు ?

ఫా:_ఆలా జరగటం అసంభవమనా మీ అభిప్రాయం? అన్నయ్యను చక్కగా చూచుకొన్నాకనే, భర్తను కూడా పరిచర్య చెయ్యొచ్చును. అన్నయ్యకు చూపెట్టే ప్రేమను ఆయనకూడా చూపెట్టవచ్చు.

మరి:_దాంతో గొడవలు ప్రారంభమవుతాయి. పైకాన్ని అక్కడా పంచిపెట్టవచ్చు, ఇక్కడా పంచిపెట్టవచ్చు. కాని ప్రేమను ఆలా ఇక్కడ కొంతా, అక్కడ కొంతా పంచిపెట్టడం ఆరంభిస్తే ... అట్టిగన్ని ప్రేమ అంటారా మరి? ఇంట్లో పనిచేసే పనిమనిషి ప్రేమలాంటిదే ఆలా చేయడం ! ఒకర్ని ప్రేమించామా, ఆయన పాద సన్నిధనే సర్వస్వాన్ని సమర్పించాలి అప్పుడే మనశ్శాంతి అనేది కల్గుతుంది. ఆలా చేయకపోతిమా ఈ జీవితంలో సుఖమనేది, శాంతి అనేది బూడిదపాలై పోతుంది. ...

ఫా:_ఆలా వూహించడం ఏమాత్రం బాగాలేదు. ప్రేమ అనేది మానవాతీతం. దాన్నే నీవు అర్థం చేసుకోవాలి.

మరి:_మీరన్నది నిజమే. అక్షరాలా నిజం... కాని ... దాన్ని గురించే ఆలోచిస్తూవుంటే ... ఈ బండి నడుస్తుందా మరి ? ఆ సంగతి చెప్పండిమరి ? ... అన్న విషయమో చూడండి ! - ఆయన చక్కబెట్టుకోవలసిన వ్యవహారాలు ఎన్నో వుంటాయి. అవే ఒకొక్కసారి మితిమించి పోయాయా చిందరవందరై పోతాడు. ఆ సంగతి నాకు చెబితేనా! ఊరక ఆ కుర్చీలో కూర్చుండి ఏమో ఆలోచిస్తూ విచార సాగరంలో మునిగి పోతూ వుంటాడు. ఆయనకు ఇష్టంలేకపోయినా కొంచెంసేపు ఆయన దగ్గరే కూర్చోవాలి. ఆ విచారానికి కారణం ఏమో తెలుసుకోవాలి. అంతేనా ! దాన్ని పోగొట్టటానికి శాయశక్తులా ప్రయత్నించాలి ... ఇతర్ల సంగతి మరేలా ?

ఫా:_(ఉద్రేకంతో) అందరి కష్టాల్ని పంచుకోటానికి నీకు వోపిక వున్నది. నిన్ను పెండ్లాడే భాగ్యం వుంటే ... ఆ భర్తే అదృష్టవంతుడు ...

మరి:_నేనేం చేశానని ఆలా పొగడారు? మనుష్యుల తత్వాన్ని స్త్రీలు గ్రహించాలి. ఆలా గ్రహించటం అంత సులభసాధ్యమా మరి! ... స్వభావరీత్యా వారిలో ఒకసారి ఆనందం, మరొకసారి విచారం, ఇంకొకసారి కోపం వుంటుంది. ఆలా వుండటం ఆశ్చర్యం, వింతా కాదు. వీటి నన్నిటినీ అన్నయ్యలో ప్రతిరోజూ చూడటం లేదూ ! వీటి నన్నిటినీ మనం అర్థంచేసుకోవాలి. దాంతో అయిపోతుందా వాటి కనుగుణ్యంగా పారిశేషమాత్రం నొప్పించకుండా పరిచర్య చేయాలి. ఆలాచేస్తే ప్రేమ అనేది ఏదో మనకు చక్కగా తెలుస్తుంది. ఆ ప్రేమను వీటికే మనో వాక్కాయలతో, తటపటాయించక సమర్పించాలి. ..

ఫా:_(కల్పించుకొని) అట్టి ప్రేమనే ఎవరైనా వాంఛించివుంటే ... అతణ్ణి ఆ ప్రేమతో సగము పావనంచేయ సంకల్పించుకోటానికి ఇష్టం లేదా ?

మరి:—(అతని ముఖంకేసి చూడకుండా) అట్టివారు లభ్యపడే భాగ్యం నాకుంటేకదూ! ... నాకింత వరకూ అట్టివారు కనబడలేదు. అట్టివారు కనబడితేకదూ, ఈ ప్రశ్నకు జవాబీయటానికి ...

ఘా:—ఎందుకు కనపడడు?

మరి:—అట్టివారు కనబడటం సులభమా? ... (నిట్టూర్పుతో) అట్టివారు దొరకడం దుర్లభం - చాలా దుర్లభం ...

ఘా:—(మందహాసంతో) అట్టివాడు వున్నాడమ్మా! నీకోసమే ... మరియానా! ...

మరి:—(మాట్లాడదు.)

ఘా:—మరియానా! నీ ముందరే వున్నాడు ఆ విషయంలో ఎక్కువగా చెప్పుకోటం అనవసరం ... ఈ రహస్యాన్ని నీకుతప్ప మరెవరికి చెప్పుకోవాలి! నిన్నే ప్రేమించాను ... ఆ రహస్యం నీకూ తెలుసు ... ఎందుకాలా భయపడతావు? ఆలా భయపడటం మంచిదికాదు. ... ఆ నాటి నుంచి నిన్ను చూచాక ... నీతో మాట్లాడటానికి అవకాశభాగ్యం లభించినప్పటినుంచీ ... ప్రేమ అనేది ఏమిటో తెలుసుకొన్నాను. ... ఆ సంగతి నీకు చెప్పకపోతే మనస్సు స్థిమితంగా వుంటుందా? ... ఇంతకాలమూ ... ఆలా చెప్పటానికి సాహసించనందుకు మరియానా! నన్ను క్షమించాలి ... నా ఇల్లు నీది. నా భాగ్యం నీది. ... నీవూ నా దానివే. నన్ను పెండ్లాడి ... ఆలా చేస్తివా, అదృష్టవంతుణ్ణి. ... మీ అన్నయ్య అంటే నాకూ ఎంతో అభిమానం. ఆయనపట్ల నాకున్న భక్తి, గౌరవమూ సంగతి ఇక చెప్పాలా? ...

మరి:—(సిగ్గుతో) ఆ సంగతి నాకు తెలియదామరి! మీరంటే నాకూ గౌరవమే ... కాని ఆ సంగతి ఆలోచించుకోటానికి ... కొంత గడువియ్యాలి.

ఘా:—(ఉత్సాహంతో) ఇంకోసారి చెప్పు దాన్నే వినాలి ... కావలసినంత గడువును తీసుకో ... మనం పెండ్లిచేసుకున్నా ... అన్నయ్య కార్యకలాపాలకి ఏమాత్రం వొడుదుడుకులుండవు. మనం ఇద్దరం ఆయనకి పరిచర్యచేద్దాం. నేనార్జించిన సొమ్మంతా ఆయన్దే...ఆయన కష్టాలన్నిట్నీ మనమూ సంతోషపూర్వకంగా భరిస్తాం. ... అంతకన్నా మరేం చెప్పాలి? ... (ఆమె చేతిని తన చేతులోకి తీసికుంటాడు.)

మరి:—(మందహాసంతో) మీరా సంగతి చెప్పాలా? ... కాని పెద్ద చిక్కు ప్రశ్నను తెచ్చారు? దాన్ని విడదీయడం ...

ఘా:—ఆ! ... చిక్కుప్రశ్నే! దాన్ని మనం ఇద్దరమూకలిసి విడదీయాలి. ... నా ఆశ ఫలిస్తుందా చెప్పు? ...

మరి:—(సిగ్గుతో) అన్నయ్యను అడగండి ...

ఘా:—(ఆమె దగ్గఱకువచ్చి, మోకాళ్లమీద నిలుచుండి) తప్పక, తప్పక ఆయన్నే అడుగుతాను ... నా భాగ్యం పండింది. నా లక్ష్మివే నీవు. ...

మరి:—(విచారంతో) ఆలా చేయకూడదు. మీ వంటివారే ఆలా చేస్తుంటే ... (కళ్లు గట్టిగా మూసుకొంటుంది. తనలో) దేవా! దేవా! ఏమన్నాను? ... ఆలా అనడం దోషంకదూ? ఇంకేం చేయాలి.

(దఘాలున అక్కడినుంచి వెళ్ళిపోతుంది.)

(సశేషము)



# సిరిసిరిమువ్వలు

ఒక పాఠశాలలో నొక క్లాసు పరీక్షా పత్రంలో "మీ కారుప్రయాణమును గురించి వ్రాయుము" అని ప్రశ్న యివ్వబడింది.

ఒక విద్యార్థి యిలాజవాబువ్రాసాడు- "మా మామతో కొండపైకి కారులో బయలుదేరి వెళ్లాము. కొంతదూరము పోయేసరికి కారు యింజను చెడిపోయింది. దాంతో మా మామ తిట్టిన తిట్లు, మేము పడ్డ కష్టము మరొకసారి వ్రాయనవసరము లేదనుకుంటాను"

♦ ♦ ♦

"అమ్మా! అమ్మా! నేనెంత విలువ చేస్తానే"

"నీకేమే! బంగారు తల్లివి! లక్షలు చేస్తావు"

"అయితే అడ్వాన్సుగా ఒక రూపాయి యియ్యి చూద్దాం!"

♦ ♦ ♦

ఒకయువకుడు వెళ్లి ఒక యింటి తలుపు తట్టాడు, ఒకముసలావిడ వచ్చి తలుపు తెరచింది.

"ఏమండీ! కమలయుందా"

"మామనుమరాలాండీ! యింట్లోలేదు. నీవు గోపాల్‌వైతే ఆమె 'మై కాఫీ బార్'లోనుంటానంది. గోపాల్‌రావువైతే యింటికి రెండు గంటల్లో వస్తానని చెప్పమంది. శేఖర్‌వైతే నీతో రావడానికి తయారుగా నున్నట్లు, మహేశ్వర్‌వైతే యింకా రెండుదినాలలో వస్తానని చెప్పమంది".

♦ ♦ ♦

ఒక కంపెనీలో పనిచేసే లేడీ టైపిస్టు తన స్నేహితురాలితో "మామేనేజరుగారు నా ఉద్యోగం ఖాయపరచేలాగుంది."

"అలాగా! - సంతోషం! ఆ విషయం స్వయంగా ఆయన చెప్పాడా"

"లేదు! - నిన్న ఉదయం నన్నుపిలచి మంచి డిక్షనరీ నొకదానిని నాకిచ్చారు".

♦ ♦ ♦

లండన్‌లో రాయల్ మెడికలు కాలేజి ప్రొఫెసర్ ఒకాయన రాజుగారి యింటి వైద్యుడుగా నియమింపబడగానే తానా విషయమును విద్యార్థులకు తెలుపాలని క్లాసులో బోర్డు మీద వ్రాసాడు.

దానిని చూచి చదువుకొనిన విద్యార్థులు లేచి నిలువబడి "భగవంతుడు రాజుగారిని రక్షించుగాక! రాజుగారిని భగవంతుడు రక్షించుగాక" అని పెద్దగా అరువసాగారు.

'అర్జునుడు'

# చిత్రకారుని చిత్రాలు

శ్రీ కావుటూరు వెంకటనారాయణరావు.



సాయంత్రం అయిదుగంటలకు "సుందర భవన్ శీతల గృహం" నుండి బయటబడి ఒక్క త్రేపు త్రేపాడు చెయ్యనులు. ఆ త్రేపుతో ఘుమ్మని వాసన గొట్టింది. ఎదురుగా జనరల్ రేడియో "అందమె ఆనందం" అనేపాట వీనుల విందుగా వుందతనికి. ఇంకా అతడా భవనం మెట్లుదిగలేదు. దిగబోతుంటే ప్రక్కనున్న బంకు బంగారయ్య అతనికో కమ్మని కిళ్ళీ కట్టిచ్చాడు. అతనికి ఆనందంలో ఆనందం చేకూరింది. మెల్లగా సూర్యుని కడ్డంగా నిలచివున్న మేడల నీడలలో నడచిపోయాడు. అక్కడక్కడ అతనికి తెలియకుండానే నిలచిపోతున్నాడు. అతని దృష్టంతా తెనుదాటిపోతున్న గోడలచే ఆకర్షింపబడింది. ఆ గోడల తెట్టుచూచి కాసేపునిలచి యేదో ఆలోచించడం మొదలెట్టాడు.

ఆగోడలమీద అతని దృష్టి నిలువడానికి కారణం వాటిమీద బొమ్మలే. ఆ బొమ్మలు రంగులతో వేసినవికావు. వాటిని చూచి వారికి, ఆ బొమ్మలు వేయడానికి, ప్రసిద్ధ చిత్రకారుని దగ్గరియే సాధనమూ అనవసరమని తెలుస్తుంది. ఇంతా ఆ బొమ్మలు బొగ్గుతో వేసినవి; సున్నపు పెళ్ళలతో వేసినవి. ఆ బొమ్మలలో మానవుని వూహాకురాగల సకలదేవతలూ వున్నారు. సర్వమానవాకృతులూవున్నాయి. ఆ బొమ్మలను చూచి, అందులోని మానవాకృతులకు యీలోకంతో యెలాంటి సంబంధముందో యెవరయినా ఆలోచించగలరు. ఆ బొమ్మలు బొగ్గుతో వేసినవైనప్పటికీ వాటికి విలువలేదనుకోవడం కళాపోషకుడు కాని వాని పొరబాటు. ఆ బొమ్మలలో కళ వుట్టిపడుతుంది. సహజమైన నాణ్యత గోచరిస్తుంది. ఆకళ మానవుడు ఆశిస్తే వచ్చేదిగాదు. నేర్చుకున్నా అంత సహజత్వముగోచరించదు. అది ఆ బొమ్మలు వేసిన వాని జన్మహక్కు! ఆ బొమ్మలు చూచినవాడు ఓ అయిదు నిముషాలు ప్రతిఒక్క చిత్రం ముందు నిలవందీ కదలలేడు.

వాటిని గురించే చయ్యనులు ఆలోచిస్తున్నాడు. వాటి చిత్రకారుడెవడో అతనికి తెలియదు. కానీ అతను వూహకుమటుకు యెవడో ఒకడై వుంటాడనుకున్నాడు. అతడా బొమ్మలను నాలుగు నెలలనుంచీ ప్రతిదినం తప్పక చూస్తున్నాడు. ఇంతకాలంనుంచీ చూస్తున్నవి పాత బడుటకు బదులు, అవి అతనికిదిన దినం క్రొత్తగానే వున్నాయి అందుకనే వాటి చిత్రకారుని అంతగా మెచ్చుకున్నాడు. అందుకనే అతనికా చిత్రకారుని చూడాలన్న వుబలాటం జాస్తయింది.

చెయ్యనులు మెల్లగా నిర్లక్ష్యంగా పాగుతున్న వుయ్యాలకాలవదాటి మునిసిపల్ మార్కెట్ చేరుకున్నాడు. తనదోవలో గాంధీది, నెహ్రూది, పటేలుది, రామకృష్ణునిది, రమణమహర్షిది, యింకా అనేక ప్రసిద్ధ పురుషుల చిత్రాలు అనేకం గోడలమీద చూచాడు.

మునిసిపల్ మార్కెట్ గోడ చాలా పెద్దది. క్రొత్తగా వెల్ల వేశారేమో తెల్లగా మెరిసిపోతుంది. ఇప్పటికి చెయ్యనులు యే బొమ్మాలేని గోడను అదొక్కటే చూస్తున్నాడు. ఆ గోడముందు ఓ పెద్ద గుంపు గుమిగూడివుంది. చెయ్యనులు మొదట ఏదో గారడీ జరుగుతుందనుకున్నాడు. కానీ ఆ సూచనలేవీ అతనికి కనుపించలేదు. అంత మంది యేదోవింత చూస్తుంటే చెయ్యనులు ఆగలేక తనూ వారితో కలసిపోయాడు. కానీ, చెయ్యనులు కేవింతా అగుపించలేదు. ఆ గుంపు నడుంగల ఓ వ్యక్తి ఓ సిమెంటు బండమీద కూర్చునివున్నాడు.

ఆ వ్యక్తి ఓ యిర్వైయేండ్ల యువకుడు. అతనిని చూచిన వెంటనే ఆమాయకుడని తెలుస్తుంది.

ఎన్నాళ్ళనుండి వుపవాసదీక్షతో వున్నాడోయేమొ! అతని యెముకలన్నీ బయటపడివున్నాయి. శరీరం నుండి మురికి వాసన గుప్పనికొడుతుంది. ఒంటి నిండా గుడ్డలేదు. అతని చూపులో దీనత్వం, బాధ గోచరిస్తుంది. ఆవ్యక్తి చేతిలో ఓసంచి వుంది. ఆ సంచిలో యేమున్నాయోనని చెయ్యానులు ఆలోచించాడు. ఆదృశ్యంలో చెయ్యానులుకు యేవింతా గోచరించలేదు. అయితే అతనిచుట్టూ అంతమంది దేనికి చేరి వున్నారోగూడా తెలియలేదు.

ఆగుంపులో అంతమంది నిశ్శబ్దంగావున్నారు. ఆవ్యక్తి ఆబండమీద అంతసేపు యేమీకదలలేదు. చెయ్యానులు వచ్చి అరగంట దాటింది. చెయ్యానులుకు యిక నిలువడానికి విసుగుపుట్టింది. ప్రక్కనున్న వారితో ఆవ్యక్తినిగురించి తెలుసుకోవడానికని సంప్రదించాడు. వారు చెప్పినమాటలతో చెయ్యానులు యెంతో సంతోషించాడు.

ఇన్నాళ్ళుగా తను బొమ్మలను చూడగలిగాడు గాని, వాటి చిత్రకారుని మటుకు చూడలేక పోయాడు. వారి మాటలతో యిప్పుడతనిని గూడ చూడగలిగాడు. ఇంతకుముందుగా చిత్రకారుని సామాన్యునిలా చూడగలిగాడు. అప్పుడతనికి ఆ వ్యక్తిమీద యే అభిప్రాయంలేదు. ఇప్పుడా వ్యక్తి తన అభిప్రాయంలో ఓగొప్పవాడు. అతనిని గురించి తనెన్నాళ్ళుగానో ఆలోచిస్తున్నాడు. కానీ అతనెలా వుంటాడో తన వూహకేగాలేదు. ఇంతకుముందు సామాన్యునిలా చూచినవానిమీద యిప్పుడు ఓ గౌరవాభిప్రాయం చూపుతున్నాడు. ఇంతకుముందు తనకు అపరిచితుడు. ఇప్పుడతను అతని చిత్రాలమీదగా తనకు పూర్తిగా పరిచితుడయ్యాడు.

అతని పేరూ ఊరో యెవ్వరికీ తెలియదు. అతడు యెవ్వరితో మాట్లాడడు. అతనికి నా అనేవారు యెవ్వరూ లేనట్టుంది. ఇంతజగంలో అతనొకడే యేకాకి. అతనికి సహచరులున్నారంటే అతని సంచిలోనివస్తువులే! అవే తను చిత్రాలువేయడానికి వుపయోగించే సాధనాలు బొగ్గులు! అతనికి చిత్రాలు వ్రాయడానికి ఒకవేళలేదు. మిడిమిడికాలే మిట్ట మధ్యాహ్నంలో రోడ్డుమీదనిలబడి బొమ్మలు వేస్తాడు. కటిక చీకటితో కప్పబడ్డ అర్ధరాత్రిలో బొమ్మలు వేస్తాడు. అదీ అతనికి తోచినపుడే! అతను ఒకరి ఆహ్వానం మీద యింతవరకు ఒకబొమ్మకూడా వేయలేదు. ఇక బల వంతంమీద యింతవరకు ఒక బొమ్మకూడా వేయలేదు.

ఇక బలవంతంమీద ఆ చిత్రకారుని చేయి కదలనే కదలదు. అందుకనే తెలసిన వారెవ్వరూ అతనిని చిత్రాలు వేయమని అడుగరు.

చెయ్యానులు యిలాంటి విషయాలు అతనిని గురించి తెలుసుకున్న తర్వాత పూర్తిగా నిరుత్సాహపడ్డాడు. అతడు తనతోనూ పలుకడేమో! అందరూ అతనిని నీచంగా; చూడవచ్చు తనుమటుకు అతనిని తనహృదయంలో యెంతో గౌరవించాడు. అలాంటప్పుడు తనతో మాట్లాడడానికేమనుకున్నాడు చెయ్యానులు.

మెలగా చీకటి పడుతున్నాది. పడమటి చుక్క మినుకు మినుకుమంటుంది. మునిసిపల్ మార్కెట్ లైటు అప్పుడే వెలిగింది. అక్కడ చేరివున్న జనం ఒక్కొక్కరే వెళ్ళిపోయారు. ఒకటిన్నర గంటనుండీ ఆ చిత్రకారుని చెయ్యానులు కనిపెడుతూ నేవున్నాడు. అతనింతవరకు కదిలినట్లేలేదు. చెయ్యానులు పట్టుదల గూడా జాస్తయింది.

అతని చుట్టూగావున్న జనం పూర్తిగా వెళ్ళిపోయారు. తనొక్కడే మిగిలాడు. ఎట్లయినా ఆ చిత్రకారుని తనగదికి తీసుకపోవాలని నిశ్చయించుకున్నాడు చెయ్యానులు. ఆసమయంలో ఆ చిత్రకారునిగురించి చెయ్యానులు మనసులో యెన్నో ఆలోచనలు మెదిలాయి.

చెయ్యానులు ఆచిత్రకారుడు తన తట్టు చూడడం గమనించాడు. అతనిని యెలా సంబోధించాలో చెయ్యానులుకు అర్థంగాలేదు. ఆ చిత్రకారుని మెల్లగా పిలిచాడు. అతనేం పలుకలేదు. మరలా పిలిచాడు. అతని మౌనం అప్పటికీ వదలలేదు.

ఆ చిత్రకారుని చేతిలోని సంచి జారిపడింది. చెయ్యానులు ఆ సంచిని తీసుకున్నాడు. అయినప్పటికీ

ఆ చిత్రకారుడు తనదికాదన్నట్లు వూరుకున్నాడు.

చెయ్యానులుకేం తోచలేదు.

అతను తనతో మాట్లాడడు.

తనే మాట్లాడాలనుకున్నాడు చెయ్యానులు.

"ఏమండీ మీపేరేమిటి" అని అడిగి తనడిగింది సబబేనా అని ఆలోచించసాగాడు చెయ్యానులు.

అయినప్పటికీ అతనేం పలుకలేదు.

"మీరు నాతో రావడానికి సంకోచిస్తున్నారా?" అన్నాడు చెయ్యానులు.

అతను లేదని తలవూపాడు.

చెయ్యానులు ఆనందం పట్టలేకపోయాడు. ఇంత సేపటికిగాను అతను కదలడం యిదే మొదటిసారి.

"అయితే మీరు నాతో రావడానికి దేనికి సంకోచిస్తారు?"

ఆ చిత్రకారుడు మౌనం వహించాడు.

"మీకు యేకీడు కలిగించను - దయచేసి నాతో రాగలరా?"

తను మాట్లాడిన మాటలతో ఆ చిత్రకారుడు మెల్లగా కదిలాడు. తనింతవరకు యిలాంటి సంభాషణ యెవరితో చేసివుండలేదు. తన మాటలనుబట్టి చూస్తే ఆ చిత్రకారుడు సమాజంతో కలసివుండడానికి దేనికో భయపడుతున్నాడు.

చెయ్యానులు, ఆ చిత్రకారుని నాలుగైదు సందులు త్రిప్పి తన గదికి తీసుకవెళ్ళాడు. త్రోవలో ఆ చిత్రకారుడు యంత్రంలా చెయ్యానులుతో నిశ్శబ్దంగా నడకసాగించాడు. చెయ్యానులు గదిలో చీకటిగా వుంది. చెయ్యానులు లైటు వేశాడు. ఆ విద్యుద్దీప కాంతిలో ఆ చిత్రకారుని బాగా పరకించాడు. శరీరమంతా మురికితో నిండివుంది. అతనిని శుభ్రంగా స్నానంచేయించి, కట్టుకోను తన పంచ తీసిచ్చాడు. ఇప్పుడతను సామాన్యపు మనిషయ్యాడు. మునుపటి రూపంతా మాసిపోయింది. తనున్నూ, అతనికిగాను ఓ క్యారియరు భోజనం తెప్పించాడు. ఆ చిత్రకారుని కానాడు యెంత ఆకలిగా వుణ్ణిందో, చెయ్యానులు సగం కడుపుతో లేచి తృప్తిపడ్డాడు. తన పడక శుభ్రంగా వేసి అతనిని కూర్చోమన్నాడు. చెయ్యానులు చేయమన్నదంతా యంత్రంలా ఆ చిత్రకారుడు చేయసాగాడు.

చెయ్యానులుకు అతని చరిత్ర పూర్తిగా తెలుసుకోవాలన్న వుబలాటం జాస్తయింది. "మీ రిలా దేనికున్నారు? మీవారెవ్వరూలేరా?" అని అడిగాడు చెయ్యానులు. అతను తలవూపాడు. చెయ్యానులుకు అతనితో సంభాషణ సాగించడానికి మాటలు రాలేదు.

ఆ చిత్రకారుడు మెల్లగా తలెత్తి చెయ్యానులుతట్టు చూచాడు. ఆ చూపులో దీనత్వం నిండివుంది. తను మాట్లాడిన మాటలకు నొచ్చుకున్నాడు చెయ్యానులు.

"మీరు నాకథ వినదలచుకున్నారా?" అని మెల్లగా అడిగాడు ఆ చిత్రకారుడు.

అదే తన ఆశయంగూడా. దానికోసమే తనింత సేపు కాచుక్కూర్చున్నాడు. ఆ చిత్రకారుడు తన కథ చెప్పడం మొదలుపెట్టాడు.

"నాకథ మీరు వింటారు - విని యేమనుకున్నా సరే దానికి నేను బాధ్యుణ్ణికాను. నా జీవితంలో మీకు క్రూరత్వం కనిపించవచ్చు - దానివలన మీకు నామీద అసహ్యతకలుగవచ్చు. నాకథ మీకు వినడానికంతగా యిష్టంలేకపోవచ్చు. విసుగు కలిగించవచ్చు - విసుగు కలిగించినా మీరు వినితీరాలి. నా కథవిని నా జీవితానికి మీరు యేసానుభూతినీ చూపనక్కరలేదు. కానీ చూపకుండా వుండలేరు - అలా వుండగలిగితేనే నా కానందం."

"నాజీవితం వెలివేయబడింది. నేను వెలివేయబడ్డాను. అది మూఢనమ్మకాలతో నలిగిపోతున్న సమాజంలోనే. ఇంకా యీ సమాజంలో మూఢనమ్మకాలు వెలివేయబడలేదు. అందుకనే యిప్పటికీ నేను వెలిగావున్నాను. వెలిలోనే నాజీవితం అంతమవుతుందేమో! నేను పుట్టటంగూడా వెలి

వేయబడ్డ రక్తంలోనుండే పుట్టానట. అది మీరు నమ్ముతారా ?” అని చెయ్యనులును అడిగాడు.

చెయ్యనులేమీ పలుకలేదు. అతను మరలా చెప్పడం మొదలు బెట్టాడు.

"నమ్మితే నమ్మండి. నేను పుట్టాను. నాదీ మీవంటి ఆశలు, ఆశయాలు, కష్టాలు, సుఖాలుగల జీవితమే! నన్ను వెలివేసినా నేను బ్రతకాలి. నేనీ ఆంధ్రదేశంలో ఓ మారుమూల పల్లెలో పుట్టాను. దేవుడు నన్నా వూరిలో పుట్టించినందుకు యిప్పటికీ అతనిని దూషిస్తాను. అది నా తెలివితక్కువేమో! ఈ సమాజంలో నన్ను పుట్టించినందుకు అతనిని దూషిస్తున్నానేమో! నేను పుట్టడంతోటే మావూరు దగ్ధమైందంటారు. మా వూరెలా కాలిందో నా జీవితమలా మండిపోతున్నది. నేను పుట్టకముందే తండ్రిలేనివాడినయ్యాను. అందుకని నాపుట్టుకకుముందే నా మీద మా తల్లికి కోపమట. కానీ మా తల్లిదండ్రు లెలావుండేవారో నేనెరుగను. అంటే మాతల్లి నే పుట్టిన వెంటనే ...”

అతని నోటినుండి మాట పెగలలేదు. అతను కాసేపుయేడ్చి కన్నీళ్లు తుడుచుకున్నాడు.

"మాతల్లి చనిపోయింది. నన్ను పెంచేవారెవ్వరూ లేరనుకోకండి. నాకంటె ముందర యీ సంఘానికి, దాని మూఢ నమ్మకాలకు బలైన మా అక్కయ్య నన్ను పెంచింది: మేమిద్దరం వెలివేయబడ్డవాళ్ళమే. నేను పుట్టేటప్పటికి మా అక్కయ్యకు ఆరేళ్లుండేవి మా అక్కయ్య నన్నెలా పెంచిందో తలచుకుంటే నా హృదయం తరుక్కుపోతుంది. అప్పటికి, మేమనాథులమైన పిదప యీ సంఘానికి దయ గలిగింది. మా అక్కయ్య ఇంటింటా చాకిరిచేసి తన పొట్టను, నన్ను పోషించుకునేది. నాకు తల్లికొరత తీరిందంటే ఆమేనని చెప్పాలి. మా తలిదండ్రుల కాస్తులు, పాస్తులుండేవేమో నాకు తెలియదు.

"నాకు దేవుడేదీ కల్పించలేదు. తుదకు యేదీ లేకుండా జేశాడు. తల్లిలేదు; తండ్రిలేదు-అప్పటికి నాకు మిగిలినది యీ చిత్రకళే! నేనా చిన్న వయసులోనే మంచి మంచి బొమ్మలు రాతిచిప్ప పెంకులతో అరుగులమీద వేసేవాణ్ణి. దానికి మావూళ్లో వారందరూ వన్నెంతో మెచ్చుకున్నారు. ఆ మెప్పులు నాకేమీ తెలిసేవికావు.”

"నేను పెరిగి పెద్దవాణ్ణయ్యాను. మరలా సంఘంలో మాకన్నీ యెదురయ్యాయి. ఆ వూరిలో వారందరూ మమ్మల్నెంతో నీచంగా చూడసాగారు. మా అక్కయ్యనుగూర్చి అప్పటినుండీ నేనెంతో చింతించేవాణ్ణి. ఆమె రజస్వలయింది. అప్పటినుండీ నేను కష్టపడి పనిచేయవలసివచ్చేది. దానివలన నాకే చదువూ రాలేదు. కానీ నా పుట్టుకతో వచ్చిన యీ చిత్రకళనే నభివృద్ధి చేసుకోవడాని కవకాశమివ్వకపోయినా అదే అభివృద్ధయింది.”

"మా అక్కయ్య సమస్య నాకు ఆ వయసులోనే ఓ పెద్ద సమస్యలా తయారయింది. మా అక్కయ్యకు పెళ్ళీడు సమీపించి దాటిపోయిందికూడా. ఆ వూరి యువకుల కండ్లన్నీ మా అక్కయ్యమీదనే వుండేవి. నేను యేమీచేయలేక హృదయభారంతో కుమిలిపోయేవాణ్ణి. రాత్రిళ్లు మా వూరిపాకచుట్టూరూ వూరివారు రాకపోకలు సాగించేవారు. మా యిద్దరి పొట్టలు నా ఒక్కడి రెక్కలమీద నిండడం దుస్సాధ్యమయింది. మా అక్కయ్యగూడా పనికి పోను మొదలు బెట్టింది.

"ఆ నాడు ! - ఆ రోజే ఆ వూరికి మాకు ఋణం తీరిపోయింది. మా అక్కయ్య పొలంలో పనికి వెళ్ళింది. నేను యింటిలోలేను. యెండలు మిక్కుటంగా వున్నందువలన నేను అలా చింత తోపుకు వెళ్ళాను. సాయంత్రం తిరిగి వచ్చేటప్పటికి యింటిలో మా అక్కయ్య యేడుస్తూంది. కారణం తెలుసుకున్నాను. ఆ వూరి ఓ రౌడీవెధవ మా అక్కయ్యను బలవంతచేశాడు. యెలాగో తప్పించుకుని యింటికి చేరుకుంది. ఆ మాటలువిన్న నా హృదయం దహించుకుపోయింది. నా రక్తం వుడికిపోయింది. కానీ

నాలోవున్న శక్తి కసితీర్చుకోడానికి అప్పుడు చాలింది గాదు. ఇక మేమిద్దరం ఆ వూరిలో వుండలేక పోయాం. ఆ రాత్రే ఆ వూరు విడిచి బస్తీకి బయలు దేరిపోయాము.”

“అప్పటికి నేను బాగా పెద్దవాణ్ణయిపోయాను. నా ఒక్కనిశక్తి మా యిద్దరి జీవితాలను పోషించ డానికి సరిపోయేదికాదు. నాకు బస్తీలోఓ బస్సు కంపెనీలో క్లీనరుగా పనిదొరికింది. మా అక్కయ్య ఓ మహారాజింట్లో చాకిరికి కుదిరింది. ఆ మహారాజింట్లోనే ఓ కొట్టు మేముండడానికిచ్చారు. మా జీవితం ఒక విధంగా గడిచిపోతుండేది. నేను నా వూహాకందిన చిత్రాలు, యితర సుప్రసిద్ధ మహా పురుషుల చిత్రాలు రచించి కొద్దిగా డబ్బు గడించేవాడిని. అప్పటికి నా హృదయ భారం కొద్దిగా తగ్గింది. మా జీవితం ఒక మంచి మార్గంలో పడబోతున్నందుకు యెంతగానో సంతోషించాను” (సశేషము)

—— (o) ——

# శ్రీమతి రామేశ్వరి నెహ్రూ

(పద్మ భూషణ్)

శ్రీమతి రామేశ్వరి నెహ్రూ 1886 డిసెంబరులో జన్మించారు. ఆమె 1909లో ప్రజాసేవా రంగంలో ప్రవేశించి అలహాబాదులో మహిళాసమితిని నెలకొల్పి, ‘స్త్రీ దర్పణ్’ అనే హిందీ పత్రికను ప్రారంభించారు. ఆమె ఆ పత్రికకు 16 సంవత్సరాలు సంపాదకులుగావున్నారు. 1934వ సంవత్సరంనుంచీ ఆమె మహాత్మగాంధీ అడుగుజాడననుసరిస్తూ, హరిజనోద్ధరణకు పూనుకొని, హరిజనాభ్యుదయానికి కృషిచేస్తూ దేశమందంతటా పర్యటించారు.

శ్రీమతి నెహ్రూగారు 1974 నవంబరులో న్యూఢిల్లీకి వచ్చి ప్రభుత్వ కోర్కెపై పునరావాసకల్పన మంత్రిత్వ శాఖలోని మహిళాశాఖకు గౌరవ డైరెక్టరు పదవిని స్వీకరించారు. పశ్చిమ పాకిస్థాన్ నుంచి వచ్చిన నిర్వాసస్త్రీలయొక్క పిల్లల యొక్క సంక్షేమానికి వారు కృషిచేస్తున్నారు. 1949 మార్చిలో ఆమెను అదే శాఖలో గౌరవ సలహాదారుగానియమించడంతో వివిధరాష్ట్రాలలోను అనాధశరణాలయాలను, బాలసంక్షేమ కేంద్రాలను అజమాయిషీ చేసే అవకాశం ఆమెకు లభించింది. ఆ సంక్షేమ సంస్థలలో1950లో 31,000 మంది, 1953 ఆఖరికి 28,850 మంది ఆశ్రయం తీసుకొన్నారు.

శ్రీమతి రామేశ్వరీ నెహ్రూకు అనేక సాంఘిక సంక్షేమ సంస్థలతోను, స్వచ్ఛంద సేవాసంస్థలతోను సన్నిహిత సంబంధమున్నది. ఆమె సహనశీలతకు నిస్వార్థ సేవకు, కార్యదీక్షకు అనేకమందిచేత ప్రశంసించబడ్డాయి. హరిజనోద్ధరణకు ప్రశంసనీయమైన కృషిచేస్తున్నదనడానికి 1949లో నిర్మించబడిన “రామేశ్వరీ నగర్” ప్రబల నిదర్శనం. నిర్వాసితులైన హరిజనులకు ఆ ‘నగర్’ నిర్మించబడింది.

(ఇండియా ప్రభుత్వ సమాచార కార్యాలయం)




# వింత ప్రశ్నలు

శ్రీ శామ్యూల్ చిట్టీ

పూర్వము కళింగదేశమును సుదర్శనుడనేరాజు పాలించుచుండెను. ఒకసారి తన ఆస్థానమునందు కొలువుదీర్చి వినోదముకొఱకు మూడు ప్రశ్నలు వేసెను. అవి 1. దేవుడెక్కడ కూర్చుండును? 2. దేవుడెటువైపున చూచుచుండును? 3. దేవుడేమిచేయుచుండును? అనునవి. కాని ఆ ప్రశ్నలకు ఎవరునూ సమాధానమీయలేకపోయిరి. అందుకు రాజు ఉగ్రుడై ఆస్థానకవితో "కవీశ్వరా మీరు సర్వము తెలిసినవారు. నేను ప్రశ్నించిన వాటికి మూడు దినములలోగా సమాధానమీయవలెను. లేనియెడల మీకు శిరశ్ఛేదనము తప్పదు" అని ఆజ్ఞాపించెను.

ఆస్థానకవి ఆ ప్రశ్నలకు జవాబులు తెలియక మిగుల దుఃఖించుచు మంచమెక్కెను. రెండు రోజులు గడచెను. మూడవరోజు ఆస్థానకవి తనకు శిరశ్ఛేదముతప్పదని విచారించుచుండెను. ఆయనకి "పంకజనయన" అను పేరుగల కుమార్తె కలదు. ఆమె చాల తెలివిగలది. మూడవ దినమున పంకజనయన తండ్రితో "నాన్నగారూ! మీరు మూడు రోజులనుండి విచారముగా నున్నారు. కారణమేమి?" యని ప్రశ్నించెను. ఆస్థానకవి కుమార్తెతో రాజువేసిన విచిత్ర ప్రశ్నలను చెప్పెను. అందుకు పంకజనయన "నాన్నగారూ! ఇంత మాత్రమునకేనా విచారము! రేపు నేనే స్వయంగా రాజుగారికి తగిన సమాధానముల నిచ్చెదను" అని చెప్పెను.

మూడవ రోజున పంకజనయన రాజాస్థానమునకువెళ్ళి "మహారాజా! మా నాన్నగారికి జబ్బుగా నున్నది. మీరు వేసిన ప్రశ్నలకు నేను జవాబివ్వగలను" అని విన్నవించగా రాజు 'సరే' ననెను.

పంకజనయన వెంటనే "మహారాజా! నేను మిమ్ముల నొక్కటి కోరుచున్నాను.

మీకు తెలియని ప్రశ్నలకు నేను సమాధానమిచ్చుచున్నాను. కనుక నేను గురువుతో సమానము. అందువలన గురువు సింహాసనముమీద కూర్చొనుటభావ్యము'' అని అనెను. రాజు అందులకు సిద్ధపడి తాను క్రింద కూర్చొని పంకజనయనకు సింహాసనమిచ్చెను. అప్పుడు పంకజనయన ఒక పాత్రలో పాలు తెప్పించి ''రాజా! ఈ పాలలో వెన్న యున్నదా? లేదా?'' అని ప్రశ్నించెను. సుదర్శనుఁడు ఉన్నదనెను. ''ఎచట నున్నదో చెప్పగలవా?'' అని పంకజనయన అడుగగా రాజు కొంచె మాలోచించి అంతటా యున్నదనెను. పంకజనయన వెంటనే ఒక జ్యోతి వెలిగించి ''వెలుతురు ఎటువైపు ప్రకాశించుచున్నదని'' అడిగెను. సుదర్శనుఁడు ''అన్ని దిక్కులకూ ప్రకాశించుచున్నది'' అని జవాబిచ్చెను. పంకజనయన మరల సుదర్శనునితో ''రాజా! నీ వెచట నున్నావు?'' అని ప్రశ్నించగా "నేను క్రింద యున్నాను'' అని జవాబిచ్చెను. ''మరి నేనెచ్చట నున్నాను?'' అని మరల పంకజనయన అడిగెను. ''సింహాసనముమీద'' అని రాజుగారి జవాబు.

పంకజనయన రాజుగారితో ఇట్లనెను: ''మహారాజా! పాలలో వెన్నవలె భగవంతుడు అంతటాయుండును. జ్యోతి అన్ని దిక్కులకూ ప్రసరించునట్లు భగవంతుడునూ అన్నివైపులా చూచుచుండును. తర్వాత దేవుడు రాజును సేవకునిగను, సేవకుని రాజుగను, పేదవానిని ధనవంతునిగను, ధనవంతుని పేదవానిగను, పట్టణములను అడవులుఁగను, అడవులను పట్టణాలుగను మార్చుచుండును. అందుకు నిదర్శనము నేను సింహాసనముమీద, మీరు క్రిందనుండుటయే! ఇవే మీవింత ప్రశ్నలకు జవాబులు''

సుదర్శనుఁడు, మంత్రులు మొదలైన వారందరును ఆబాలిక తెలివి తేటలకు మెచ్చుకొనిరి. ఇట్లు పంకజనయన తండ్రి ప్రాణాన్ని కాపాడెను.

బాలలూ! చూశారా పంకజనయన తనతండ్రిని ఎలారక్షించగల్గినదో!

# నత్త తెలివి

ఒక రోజున గుఱ్ఱం ఒకటి రోడ్డుమీద నడుస్తూ వెళుతూంది. ఆ రోడ్డుమీద సరిగా అదే సమయానికి ఒక నత్తగుల్లగూడా ప్రాకుతూ వెళుతూంది. అలా ప్రాకుతూ ఎక్కడికో వెళుతున్న నత్తగుల్లని చూసిందిగుఱ్ఱం.

గుఱ్ఱం నత్తగుల్ల దగ్గరగా వెళ్ళి హేళనగా "మెల్లిగా నడవడంవల్ల నున్నితము, లావణ్యమూ పోతుంది'' అంది.

ఆ మాటలను నత్త విని సహించలేక

"ఏమిటో అనుకుంటున్నావు మమ్మల్లను, పరుగు పందేలలో గొప్పగా పరుగెత్తి పేరుపొందగల వారము" అని అధికారస్వరంలో సమాధానం యిచ్చింది.

నత్తగుల్ల పలికిన ఆ మాటలకు గుఱ్ఱం పకపకా కడుపుపగిలేటట్లు నవ్వుకొని "అయితే, మరి అలాటి పరుగు పందేనికి వస్తావా" అని పిలిచింది గుఱ్ఱం.

గుఱ్ఱం అడగడం తడువుగా "ఆ! తప్పకుండా వస్తాను" అని అందుకు సమ్మతించింది నత్తగుల్ల.

గుఱ్ఱం, నత్తగుల్ల కలసి "రేపు ఉదయం పందెం జరగాలి" అని నిశ్చయించుకున్నాయి.

ఆదినం సాయంత్రం నత్తగుల్ల బయలుదేరి అక్కడా, అక్కడా వున్న తన బంధువులను, మిత్రులను కలుసుకొని, అందరినీ ఒక చోట సమావేశపరిచింది.

"గుఱ్ఱం మాంసం మంచి బలమయినది. అనేక బలమయిన రోగాలకు మందుగాకూడా పనిచేస్తుంది. అందులోనూ తలనొప్పికి చాలా ఘాటుగా వెంటనే పనిచేస్తుంది" అని సలహా యిచ్చింది. "ఆమాంసం మీకు కావాలా" అని మిగిలిన నత్తలను అడిగింది నత్త. అందుకు అక్కడ చేరిన నత్తలు "ఆఁ! మాకెందుకులే ఆకాస్త మాంసం" అని మూతులువిరిచి వూరుకొన్నాయి.

అప్పుడునత్త తనకూ గుఱ్ఱానికీ మధ్యన జరిగిన సంభాషణ అంతా చెప్పి పరుగుపందెం వేసుకొన్నానని చెప్పింది.

"ఈ విషయంలో మీరంతా నేను చెప్పినట్లు విని సహాయపడాలని కోరుతున్నాను. అలా నామాట విన్నారా మనకు గుఱ్ఱపు మాంసం లభ్యమౌతుంది" అంది. నత్తలు "సరే" అన్నాయి. నత్తలన్నింటిని ప్రతి నాలుగు ఫర్లాంగులకు ఒకటి చొప్పున పందెం వేసుకొన్న మార్గంలో నిలువమని చెప్పి ఏర్పాటు చేసింది. అవి అలాగే వాటివాటి నిర్ణయంప్రకారం బయలుదేరి ఆస్థలాలు చేరేటప్పటికి రాత్రి గడచి, తెల్లవారింది.

నిర్ణయించుకున్న ప్రకారం ఉదయాన్నే గుఱ్ఱం, నత్త పందెం స్థలంలోసిద్ధంగా వచ్చి నిలుచున్నాయి. పరుగుకు బయలుదేరేముందు నత్త గుఱ్ఱంతో ఒక నిబంధనను ఏర్పరిచింది. "పరుగెత్తే బాటలో ప్రతి నాలుగు ఫర్లాంగులకు ఒక సారి మనమిద్దరం ఆగి ఒకరి నొకరం చూసుకొని పలకరించుకోవాలి" అని.

అందుకు గుఱ్ఱం సరే అని ఒప్పుకొంది. యథాప్రకారం గుఱ్ఱం పరుగెత్తడం మొదలు పెట్టింది. నత్త తనలో తాను నవ్వుకుంటూ మెల్లిగా నడక సాగించింది.

గుఱ్ఱం అతివేగంగా పరుగెత్తుకుని నాలుగవ ఫర్లాంగువద్ద ఆగింది. అక్కడయింతకముందే వుంది కదూ — గుఱ్ఱం నత్తను పిలవగానే అక్కడవుండేనత్త గుఱ్ఱం దగ్గరగావచ్చి హాజరుగా నిలిచింది.

ఆ నత్తను చూచి ఏ విధమైన భేదం లేనందున గుఱ్ఱం అమితాశ్చర్య పడింది. సరే! పద మరి నాలుగు ఫర్లాంగులలో నిన్ను ఓడించలేక పోతానా" అంటూ తిరిగి పరుగు లంకించుకుంది.

అదే విధంగా ప్రతి నాలుగు ఫర్లాంగులవద్ద నత్త బంధువులు ప్రత్యక్షంగావడం, గుఱ్ఱం పరుగుపెట్టడం జరిగింది.

ఆలా ఎంతదూరం పరుగెత్తినా ప్రతి నాలుగు ఫర్లాంగులకు నత్త హాజరు అవుతూనేవుంది. కడకు గుఱ్ఱానికి పిచ్చి ఎత్తి పరుగెత్తి, పరుగెత్తి గుండె ఆగిపోయి గిలగిలతన్నుకొని చనిపోయింది.

అక్కడికి మెల్లగా అన్ని నత్తలూ చేరుకుని ఆ గుఱ్ఱపు మాంసాన్ని సంతృప్తిగా భుజించాయి.

అప్పటినుండి ఆనత్తలకు వళ్ళునొప్పులుగాని, పగులుట గాని లేదని ప్రతీతి!

(మూలం: బర్మా జానపదగాథ)

'అజ్ఞనుడు'

# బంగారు చీర

ఒకప్పుడు ఒక మహారాజుండేవాడు. ఆయనకు ఒక కుమారుడు పుట్టాడు. వెంబడే జ్యోతిష్కులను పిలిపించి పుట్టిన శిశువుయొక్క జాతక ఫలములను చెప్పవలసినదిగా కోరాడు. వారందరు ఏకగ్రీవంగా "ఈ శిశువు యీ రాజ్యంలోనుండటం ప్రమాదకరము, ఈ శిశువున్న రాజ్యంలో క్షామములు, యుద్ధాలు, వ్యాధులు ప్రబలంగా నుంటాయి" అని చెప్పారట.

రాజు జ్యోతిష్కుల మాట నమ్మి తన యొక్క, తన దేశ క్షేమాన్ని యుద్దేసించి పుట్టిన శిశువును, తల్లిని తన రాజ్యపు సరిహద్దులలోని అడవిలో ఒక పాడుపడిన శివాలయంలో వదిలేసిరమ్మని తన పరివారానికి ఆజ్ఞయిచ్చాడు.

అప్పటినుండి ఆ రాణి మారువేషంతో చుట్టుప్రక్కల గ్రామాలలో బిక్షాటనం చేస్తూ, పాడుపడ్డ శివాలయంలో పసిపాపతోసహా తలదాచుకొని కాలక్షేపం చేయసాగింది.

రాణి నివసిస్తున్న ఆలయానికి సమీపమునసే ఒక గ్రామముండేది. అందులో నొక సాలెవాడు తన సర్వస్వమును వెచ్చించి బంగారు చీర నేసి మహారాజుగారికిచ్చి బహుమతి సత్కారముల పొందవలచాడు. చీరనుచూచి రాజు "దీని మూల్యము ఏమాత్రం" అని అడిగాడు.

"ప్రభూ ? దీని విలువ యింతఅని నిర్ణయించవలసినవారు మీరు—నా సర్వస్వాన్ని దీనిని తయారు చేయడానికి వినియోగించాను ... యిక ప్రభువుల అనుగ్రహం" అన్నాడు సాలెవాడు.

"అలాగకాదు - తయారుచేసినవాడివి నీవు—నీకు తోచిన వెల నీవుచెప్తే..."

"కనీసం ఒక లక్షరూపాయలు..."

"అబ్బో! యింత ధరగల చీర మాకవసరంలేదు" అని చెప్పి పంపేశాడు.

పాడుపడిన శివాలయంలో పెరుగుతున్న రాజకుమారుడికి 6 సంవత్సరముల వయసు వచ్చింది. తల్లిని పోషించడానికి కూలినాలిచేస్తూ తల్లి, కొడుకులు ఉన్నంతలో ప్రశాంతమైన జీవితం గడుపుతున్నారు.

ఒకరోజున సాలెవాడు నివసిస్తున్న గ్రామంలో తిరుగుతుండగా సాలెవాడు తాను నేసిన బంగారుచీరెను ఎవరికో చూపుతుండగా చూచాడు. దానిని తన తల్లికిస్తే బాగుండు ననుకొని వెళ్లి "ఏమయ్యా! యీ బంగారుచీర మా తల్లికి కావాలి, ఇప్పుడుమాత్రం డబ్బులేదు—రెండు నెలలలో నీవు అడిగినదానికంటె ఎక్కువ యిస్తాను"

అని ముందు వెనుకలు ఆలోచించకుండా అడిగాడు.

అంతవరకు ఆ చీరను మేమిస్తాము దాని క్రయమును, యివ్వని అడిగినవారు లేరు. ఈ కుర్రాడువచ్చి అడిగేసరికి వాడికేమి బుద్ధిపుట్టిందో చీరను యిచ్చి పంపాడు.

ఆ చీరను తీసుకొనివెళ్లి తల్లికిచ్చాడు, కట్టుకోమని. ఆమె దాన్ని ధరించి కుమారునితో తన భర్త పరిపాలిస్తున్న రాజ్యపు రాజధానిలోనికి వెళ్లింది.

బంగారుచీర కట్టుకున్న రాజుగారి పెద్ద భార్యను చిన్నభార్య చూచి పరుగెత్తుకొనివెళ్లి "ఏమండీ? నాకు కొనిపెట్టకుంటే కొనియ్యకుండా చాటుగా మీ పెద్దభార్యకు బంగారుచీర కొనిచ్చారు కదూ" అంటూ అలిగింది.

వెంటనే పోతూయున్న తన పెద్ద భార్యను, కుమారుని పిలిపించి "ఈ బంగారుచీరను కొనడానికి కావలసిన ధనం మీకెక్కడిది" అని అడిగాడు.

"ప్రభువుల అనుగ్రహముంటే మాకు లేనిదేమున్నది!- డబ్బు రేపు మాపట్లో యిస్తానని తీసికున్నాను-నేను యీ లోపల చనిపోయినా, సాలెవాడు చనిపోయినా ఒకరినొకరు డబ్బు అడిగేదిలేదు. యివ్వడమనేది లేదు. నేనీలోపల యువరాజునే అయితే సాలెవాడిడబ్బు వాడికి ముట్టుంది" అన్నాడు.

పిల్లవాడి తెలివితేటలకు సంతోషించి తన భార్యను కుమారుని ఎప్పటియట్లు ఆదరించి అంతఃపురంలోకి జేర్చి, కుమారుని యువరాజుగా జేశాడు. సాలెవాడు కోరినదానికంటె ఎక్కువమూల్యమునిచ్చి ఆదర సత్కారాలు జరిపాడట యువరాజు.

రామరాజు సత్యకళ్యాణి

# తాతయ్యా ప్రహసనం

శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణ్య శర్మ



[బుద్ధిలేని మహారాజు ఆస్థానంలో సన్మానసత్కారాలు భావకవులతో ప్రారంభమయి డబుల్ యం. ఏ., హైస్కూలు సీనియర్ పండితుడు వీధిబడి మాష్టర్లవరకు కాగానే రాజు, మంత్రి సమాలోచనలు జరిపి శాస్త్ర పండితుల సన్మాన సందర్భమున ఆస్థాన విద్వత్కవి లాభం లేదని అధ్యక్షుడుగా నేతిబొట్టు శాస్త్రిని నిర్ధారణచేసి సమావేశం ప్రారంభమయింది. అందులో నాలుగు, మూడు, రెండు, ఒకటి, అర్ధ శాస్త్రములు చదివినవారికి క్రమంగా నాలుగువందలు, మూడు వందలు రెండువందలు, వంద, అరవందగాను, కావ్యాలు మాత్రం చదువుకున్న వారికిపాతికగానువార్షిక పారితోషికాలుగా నిర్ణయించి సన్మానాలు జరిపి పండితులను పంపివేయగానే విద్యార్థులు తమకేం సన్మాన సత్కారాలులేవా యని మొరబెట్టుకున్నారు. అధ్యక్షుడు దానికి మొదట విముఖుడుగానున్నా విద్యార్థులను తమలోఅర్హులెవరో పేర్కొనమన్నారు. వాళ్లు తికమకలు, తర్జనభర్జనలు చేసి ఉభయభాషా అప్రవీణ్ణి సూచించారు-యిక చదువండి.]

(గతసంచిక తరువాయి)

ఉ. భా. ప్ర:-అధ్యక్ష మహాశయా! మా అహోబలపతి చేసిందీ, మీకయ్యేటుడు చేసిందీ ఒకటే తెలుసా?

అ:_అహోబలమో. అహోబలమో నాకు తెలియదు. తమ శాఖవారికి ఏయే రీతి సన్మానాలు తగునో ఆ రీతి లిస్టు చదవండి యిస్తాం.

ఉ. భా:_

ఉభయభాషా ప్రవీణ A ప్యాసయినవారికి నూరు.
,, B ,, రెండునూర్లు
భాషా ,, ,, ,, మూడునూర్లు.
A విద్వాన్లకు నూరు.
B విద్వాన్లకు రెండునూర్లు.
విద్వాన్లకు మూడునూర్లు.

అ:_A విద్వాన్‌కి తగ్గించేవేమయ్యా? సంస్కృతం సిరోమణి వాళ్ళతో సగం వుందిగా.

ఉ. భా:_ఉభయభాషా ప్రవీణ Aఅన్నా A విద్వాన్ అన్నా సమానమే. అందుకే సరిసమానం ఏర్పాటు. ఉభయభాషా ప్రవీణ A కి తగ్గించాను కనుక A విద్వాన్లకూ తగ్గించాను.

అ:_ ఉ॥ భా॥ ప్ర॥ లకు ఎందుకు తగ్గించేవు? ఎవరు తగ్గించమన్నారు?

ఉ. భా:_నన్ను అధ్యక్షుడిగా పిలిస్తే నా జాతికే ఎక్కువ సంభావనయిస్తే నన్నుపిల్చిన ఈ విజాతీయులందరూ మీదపడి చంపెయ్యరూ?

అ:_ అసలు విలువ చెప్పవయ్యా!

ఉ:_A విద్వాన్లు, ఉ. భా. ప్ర. లు ఎంత యిస్తే అంతకే సంతోషిస్తారు. ఫరవాలేదులెండి.

అ:_ఎందుకలా సంతోషిస్తారు ?

ఉ:_మనకి తెలివివుండి. అది చాలు. ధనం, తెలివి_ ఈ రెండూ మనంకొట్టేస్తే తోటివాళ్లు ఏడుస్తారనే కనికరంకలవాళ్లు కనుక పై రీతివేసేను. వీళ్ళు సంతోషిస్తారు కూడాను.

అ:_విద్వాంసులారా ! మిమ్మలను విద్వాంసులారా అని పిలవడానికి నా నాలిక అంగీకరించడం లేదు. మీ కందఱికీ సంతోషమేనా ?

వి:_చాల సంతోషం_ (అని గప్ చిప్ గా సన్మానాలు తీసికొని వుటాయించేరు )

మం:_శాస్త్రపండితులు పూర్తి అయ్యేరు. ఇక శిల్పులు దయచెయ్యండి_మీకు పరీక్ష లేదు. తరతమ భావంలేదు. శిల్పశాస్త్రం అభివృద్ధి చేయండి. ఈయేడుకన్న మీదటికి పదిరెట్లుగండి. ఇప్పుడువచ్చిన ఏభైమందికి నూటపదార్లిస్తున్నాం. మీరుతెచ్చిన ప్రతిమలు మా మ్యూజియంలో వుంచుతాం. మీదటికి తిక్కన్నను, నన్నయ్యను, ఎఱ్ఱాప్రెగడను, మిగిలిన అష్టదిగజములను చిత్రించి ప్రతిమలు తయారుచేసి తీసికొనిరండి.

శిల్పులు: మంత్రివర్యా! మీది, మనరాజాగారిదీకూడా తయారుచేసి తీసుకోస్తాం (అని సన్మానాలందుకొని వెడలిరి)

## 8-వ రంగం

మం:_ఇక మిగిలినవారంతా ముందుకి రండి.

కల. పం!_ అయ్యా నేను ప్రతికవిని గురించి ప్రతి పత్రికలోనూ ఏదో పొగుడుతూ వ్రాస్తూవుంటా, దోషాలు నేను ఎఱుగను. వాటిజోలికి నేనుపోను.

మం:_తీసికో నూటపదార్లు.

కల. పం:_(తీసికొని నిష్క్రమిస్తాడు)

మం:_తరువాత

సాం. పం:_అయ్యా ! నేను ఆంధ్ర ప్రబంధాలలో నాయికల వర్ణనలు, నక్షత్రాల వర్ణనలు, సూర్య చంద్రోదయాస్తమయ వర్ణనలు – వగైరా వర్ణనలన్నీ ప్రోగుచేసి సంపుటాల క్రింద వేసేనండి. ఇంకా శైవవాఙ్మయం అని, వైష్ణవ వాఙ్మయం అని, అద్వైత కవులని, ద్వైతకవులని, విశిష్టాద్వైతకవులని, లిస్టులు తయారుచేయడం - పది సంపుటాలు అయిందండి.

మం:_చాల్లేవయ్యా ! గొడవ, రెండువందలిస్తున్నా, తీసుకో.

సా:_(తీసికొని పోతాడు)

మం:-తరువాత.

కదం. పం:_అయ్యా ! నేను పత్రికలలో వాళ్ళూ వీళ్ళూ వ్రాసే పెద్దపెద్ద వ్యాసాలు సంగ్రహించి ఆ వ్యాసాల కర్తల అనుమతితో కూర్పరిని అయ్యాను.

మం:_చాలు చాల్లే నూరు పుచ్చుకో.

కద. పం:_(సంతోషంతో పోతాడు.)

మం:_తరువాయివారు.

ఉపా. పం:_ అయ్యా ! నేను చమత్కారాలు వ్రాస్తూటాం, నాదంతా కథలు, ప్రహసనాలు, నవలలు. ఇది నా చరిత్ర.

మం:_పుచ్చుకో నూరు.

ఉపా. పం:_చాలదండీ.

మం:_అయితే పోవయ్యా ! ఉత్తచేతుల్తో.

ఉ:_కాదండీ, నాలో ప్రతిభ లేదంటారాండి ?

మం:_ఉంది. కాని నీ రచనలు తాత్కాలికానందప్రదాలే.

ఉ:_అయితే నా సన్మానం యిప్పించండి.

మం:_ఇందాకా యెందుకు పుచ్చుకోలేదు, పో, ఇక యివ్వేరు.

ఉ:_ఇక ఎప్పుడు ఎదిరించనండి. ఇప్పించండి.

మం:_నామీద ప్రహసనం వ్రాస్తావేమో ?

ఉ:_వ్రాయనండి. దేవుడుతోడు రాయనండి.

మం:-వ్రాస్తివా చస్తివి. జాగ్రత. రెండు నూర్లు ఇస్తున్నా. ఎందుకు యింకోవంద యిచ్చానో తెలిసిందా?

ఉ:_తెలిసిందండి.

మం:_ఏమి తెలిసింది?

ఉ:_తమమీదగానీ, రాజుగారిమీదగానీ ప్రహసనం వ్రాయకుండా ఉండడానికండీ,

మం:_జాగ్రత సుమా! మళ్లీ సంవత్సరం ఇంకో వంద ఎక్కువ చేయిస్తాన్లే, సంతోషంతో పో.

ఉ:_(సంతోషంతో బ్రతుకుజీవుడా అని పుటాయించేడు)

మం:-మాయలమరాఠీ పండితులకు లోపల యేర్పాటు చేయించాం పోండి.

(భయంతో లోపలికివెళ్లి అయ్యో కుయ్యో మొర్రో ధ్వనులతో ప్రారంభించి, కొంత అల్లరిచేసి తుర్రు మన్నారు.)

మం:_పీరికాజ్ఞాన పండితులకు నూరేసి యిస్తున్నాం. సంతోషించండి.

పీ:_(సంతోషం - అని ఉటాయించేరు)

మం:_పాఠభేదాల పండితులకు, శాసనాల పండితులకు నెల 1కి మూడువందలు జీతం. మీరు చచ్చే వరకు మా సంస్థానంలో ఉండండి. మనం మనం కలిస్తేనేకాని లోకనాటకం ఆగిపోదు.

రా:_సభ సమాప్తం అయిందా?

మం:_అయిందండి. అధ్యక్షులులేని సభలు త్వరగా ముగిసిపోతాయండి. మంచి, మా మహారాజు వారిది; చెడ్డనాది: కాన సభ్యులు నన్ను మన్నించండి.



## మృత్యువుపై విజయం

ఇటీవలవరకూ క్లినికల్ మరణం తరవాత 5 6 నిముషాలలోగా మాత్రమే ప్రాణిని బ్రతికించవచ్చునని అభిప్రాయముండేది. కీవ్‌లోని బొగొమొలెట్స్ శరీరశాస్త్ర విజ్ఞాన సంస్థసభ్యులు యీ గడువును 15 నిముషాలకు పొడిగించగలిగారు. జంతువులమీద పరిశోధనలు జరిపినప్పుడు కృత్రిమ రక్తప్రసార పద్ధతి వుపయోగింపబడింది.

ఆటోమేటిక్ ఇంజక్టర్ అనే ఒక ప్రత్యేకపరికరం, పనిచెయ్యడం మానివేసిన జంతువుగుండె, ఊపిరి తిత్తుల స్థానంలో పనిచేస్తుంది. నెత్తురులో సాధ్యమైనంత అధికంగా ప్రాణవాయువును కలిపి, యీ పరికరంయొక్క మీది పంపుసహాయంతో దానిని శరీరంలోకి ఎక్కించడం జరుగుతుంది. వెంటవెంటనే నీలిరక్తం శరీరంనుండి దిగువ పంపుద్వారా తీసివేయబడి కృత్రిమ ఊపిరి తిత్తులకు పంపబడుతుంది. నెత్తురులో సాధ్యమైనంత అధికంగా ప్రాణవాయువు కలపబడి మళ్లీశరీరంలోకి పంపబడుతుంది. ప్రాణి ఊపిరితీస్తుంది, మళ్లీ గుండె పనిచేయడం ప్రారంభిస్తుంది. 'టాస్'

——0——

## ఆంధ్ర జానపదగేయ వాఙ్మయం.

# గాంధారికథ (విమర్శ)

శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు



ఇదొక జంగం కథ * దీనిలో గేయం, వచనం, స్వల్పంగా పదాలుకూడా ఉన్నాయి. దీని ఊత పదాలూ, కుమారరాముని కథలోని ఊతపదాలూ, ఒక్కటే - అనగా, 'తందాన' 'మేలు మేలు' అని ఉన్నాయి.

క్రీ. శ. 1800 ప్రాంతంవాడని చెప్పదగిన సారంగపాణి అను కీర్తన కవి ఒకకీర్తనలో ఈ కథను గురించి ఇట్లు చదివేడు—

ఏణాక్షిరో ! యీ సామ్రాజ్యానికి

ఏమిటి గాంధారి తనాలు

(సారంగపాణీ పదాలు, ద్వితీయభాగం 41 వ పదం)

గాంధారికథ అంతకిపూర్వందని నిర్ణయ మౌతుంది

ఈ జంగం కథ కర్తపేరు తెలియదు. కాని దీనిని రచించిన కవీ, కుమారరాముని కథను రచించిన కవీ ఒక్కడే అని ఈ రెండు గ్రంథాలను చదివితే తెలుస్తుంది. అట్టి నిర్ణయానికి కొన్ని కారణాలు—

(1) ఈ కథ యొక్క ప్రథమ చరణాలు కుమార రాముని కథయొక్క ప్రథమ చరణాలూఒక్కటే. ఇవి నిజంగా కుమార రాముని కథకే మాత్రమే సంబంధించినవి. ముద్రాపకుల లోపంవల్ల గాంధారి కథలోకి కూడ వచ్చేయి. ముద్రాపకులు గాంధారి కథకి ఒకటో భాగమని పేరు పెట్టేరు. వీరు అచ్చువేసిన కుమార రాముని కథ లభించడం లేదుకాని అది రెండో భాగమని వారి అభిప్రాయమని తోస్తూంది. నిజంగా ఈ రెండు వేరు వేరు కథలు. కాని వీటి కుండే దగ్గిర పోలికలనుబట్టి ఇవి ఒక కథలోని రెండు భాగాలని పొరపడివుంటారు.

(2) ఈ రెండు కథలలోను పట్టపు దేవులు సంతానం కోసం తపస్సు చెయ్యడానికి వేరు వేరు కొండలకు పోతారు. ఈ ఘట్టం కొన్ని పుటలు వ్యాపించినా, రెండు కథలలో చరణాలు చాలవరకు ఒక్కటే !

(3) ఈ రెండు కథలు దరువు అను పేరు పెట్టి ఒకే చేయక్షణంలో లచించ బడ్డాయి.

(4) పన్నెండేండ్ల విద్యను వర్ణించే వాక్యాలు రెండు గ్రంథాలలోను ఒక్కటే,

(5) రెండింటిలో అనేక సమానాంశాలున్నాయి. పాతాళ గంగ, పోలిసెట్టి, మంత్రాల పుస్తకం, నాగంభట్టు, మేఘరంజి గుర్రం, దాదినంగ, దాదువైన అంబుజాక్షి, పద్మాక్షి, నీలవేణి, ఇంతే కాకుండా సమానమైన అనేక మాటలు, పలుకుబళ్లు ఉన్నాయి. ఉదా:— కుంభనీకోట, మందీ మార్బలం మొదలైనవి. రాజును పట్టపుదేవి చేసే సంబోధన రెండింటిలోను ఒక్కటే !—

ద్వి. 'ఓ జీవితేశ్వర ! ఓ ప్రాణనాథ !

రాజమన్నె కుమార ? రాజగాండీవ !'

(6) కథలు జరిగిన కాలక్రమం ఒకదాని తర్వాత ఒకటుంది, మహా ఉంటే ముప్పై ఏండ్లదార ఉండవచ్చు. ఒకే కవి రచించేడన్న విషయాన్ని అది బలపరుస్తూంది.

ఇట్టి పోలికలు బోలెడన్ని ఉన్నాయి.

### కథారంగం, కొన్ని మాటలు

* గాంధారి కథను, కుమార రాముని కథనుకూడ పమ్మ అరుణాచల సెట్టి, 49 అణ్ణాపిళ్లె వీధి, చెన్నపురి వారు సుమారు ముప్పై ఏండ్ల క్రిందట ముద్రించేరు. ఇప్పుడు నేను విమర్శిస్తూన్న కథ ముద్రణ ప్రతేగాని ఎవరు ముద్రించినది, ఎప్పుడు ముద్రించినది వైనం ఎక్కడాలేదు.

కథలలో ఈ కింది స్థలాలు మొదలైన పేర్లు కనబడు తున్నాయి. తారాశిలపట్టణం, వాలుగొండ, శ్రీశైలం, సుందరగిరి పట్టణం, వెల్లటూరు, వాగువేరు, పర్వతాల మల్లికార్జున స్వామి, పగంటి ఈశ్వరుడు, వెలిగందల పవ్వాకులు (77) మొదలైనవి ఉన్నాయి. పై స్థలాల పేర్లలో కొన్ని సృష్టించ బడ్డవి. దానికి కారణం తర్వాత తెలుసుకొందాం.

## ఏ కథ ముందు రచించ బడింది?

గాంధారి కథ, కుమార రాముని కథలలో కవి ఏ కథను ముందు రచించేడు? గాంధారి శబ్దం కుమార రాముని కథలోగాని, అట్లే కుమారరాముని శబ్దం గాంధారి కథలోగాని దొరికితే, ఈ విషయాన్ని సులువుగా చెప్పవచ్చు. కాని అట్టిది జరగలేదు. ఈ సమస్యను ముద్రాపకులే చాలవరకు తీర్చేరు. గాంధారి కథను ప్రథమ భాగమన్నారు. అప్పటికి కుమారరాముడి కథ రెండో భాగ మవుతుంది. గాంధారి కథే ముందు రచింప బడ్డదన్న మాట!

కుమార రాముడి కథ కంటె గాంధారి కథ ముందు జరిగింది. ఆ విషయం ముందు ముందు చర్చిస్తాను. దానిని బట్టి గాంధారి కథే తొలి రచన అని చెప్ప వచ్చు.

ఇంతకంటే బలమైన ఆధారం లభించలేదు.

## జంగం కథలోని పాత్రలు

జంగం కథ సాధారణంగా జరిగిన అంశాలమీదే ఆధారపడిఉంటుంది. కాని ఆ విషయం ఈ కథలో



ఇండియా అధ్యక్షునిచే 'పద్మభూషణ్' బిరుదు ప్రదానము చేయబడి సత్కరించబడిన సంఘసేవకురాలు శ్రీమతి రామేశ్వరి నెహ్రూ. ఈమె ప్రస్తుతం ఢిల్లీలో పునరావాస కల్పనమంత్రిత్వశాఖకు గౌరవ సలహా దారురాలుగా నున్నారు.

తెలియడానికి క్లిష్టంగా ఉంది. దీనిలో ముఖ్యమైన స్థలనామాలు ఈ కిందివి—తారశిల పట్టణం, శ్రీశైలం, వాలుగొండ, సుందరగిరి పట్టణం. ఇవన్నీ పశ్చిమాంధ్రంలోని వాటిగా భావించవచ్చు. కవి కొన్ని పేర్లను సూటిగా చెప్పి, కొన్నిటిని నిర్మలంగా చెప్పేడు. కాబట్టి తెలియడం కష్టంగా ఉంటే కుమారరాముని జీవితం క్రీ. శ. 1315 ప్రాంతానిది. ఆ కాలానికి ముందున్న చరిత్రను పరిశీలించిచూచి పైపేర్లకు సరిపడే విషయమేనా ? యేమో చూడాలి. తారశిలపట్టణం ఏకశిలా నగరమేకాని మరొకటికాదు. మిగత పేర్లను పరిశోధించవలసి ఉంది.

అట్లే మనుష్యుల పేర్లలోకూడ మర్మము కనబడుతూంది. వసుపతిరాజు భార్య పేరు పద్మగంధి. ఆ రాజు తారశిల పట్టణం రాజధానిగా ఏలుతున్నాడు. వారి కుమార్తె పేరు గాంధారి. వాలుకొండను ఏలే రాజు మాంధాత. అతని కుమారుడు సుహితరాజు; కుమార్తె సంగమ్మదేవి. సుందరగిరి పట్టణాన్ని గాంధీవరాజు ఏలుతున్నాడు అతని భార్య వసుపతిరాజుకి చెల్లెలు. వీరి కుమారుడు బాలరాజు. చారిత్రకంగా చూడబోతే ఈ పేర్లు సూటిగా లేవు. తారశిల పట్టణమంటే ఏకశిలా నగరమని తెలుసుకొన్నాం ఏకశిలానగర రాజైన గణపతికే కవి పసుపతి అని పేరు మార్చేడు. గాంధారి అనునామె గణపతిరాజు కూతురై అయిన రుద్రాంబేకాని మరొకరుకాదు ఆకాలపు చరిత్రకు చివర్లు తెలిస్తేగాని మిగత పేర్ల గూఢత్వం తేలదు. ఆకాలపుచరిత్ర టూకిగా మాత్రమే తెలియజేస్తాను.

గణపతి రాజు (క్రీ. శ. 1198–1265) ఏకశిలా నగరాన్ని రాజధానిగా చేసి కాకతీయ రాజ్యాన్ని పరిపాలన చేస్తున్నాడు. అతని పట్టపుదేవి సోమాంబ. అతని చెల్లెలిపేరు కుందాంబ. గణపతికి పుత్రసంతతి లేదు. కుమార్తెయైన రుద్రాంబనే రాజ్యానికి పరిపాలకురాలిగా చేయ దలపెట్టేడు. రుద్రాంబకి అప్పటికే వివాహమయింది. నిడుదవోలును, ఇందుశేఖరుడు (భార్య ఉదయాంబ) పరిపాలిస్తున్నాడు. అతని కుమారుడైన చాళుక్య వీరభద్రేశ్వరుడే రుద్రాంబ భర్త. గణపతి జీవించి ఉండగానే క్రీ. శ. 1260 లోనే రుద్రాంబ పట్టాభిషిక్తురాలయింది. ఈమె 1295 వరకు పరిపాలించింది.

ఈ జంగంకథలో గాంధారి (రుద్రాంబ) వివాహం కడపటి యుద్ధంమాత్రమే చిత్రంగా వర్ణించబడ్డాయి.

జంగంకథ టూకిగా చెప్తాను. వసుపతిరాజు గాంధారిని తన మేనల్లుడికి ఇచ్చి వివాహంచేయ దలపెట్టాడు. కాని అతని భార్యకి ఇష్టంలేదు. ఆమె తన సోదరిడికిచ్చి వివాహం చేయాలని ఉద్దేశించింది. గాంధారికి మేనమామంటే ఇష్టంలేదు. మేనమామనే చేసుకోదలచింది. కాని తల్లిమాటని ఎదిరించలేకపోయింది.

(సశేషము)




**జ్ఞానేశ్వరి (భగవద్గీత) : శ్రీదిగవల్లి శేషగిరిరావు. ప్రచురణకర్తలు : ఆధ్యాత్మిక గ్రంథమండలి, విజయవాడ 2, వెల రు. 5/-లు.**

ఇది జ్ఞానదేవ విరచితమయి భగవద్గీతకు అనువాదము. ఇందులో పదమూడవ అధ్యాయమునుండి పద్ధెనిమిదవ అధ్యాయము వరకున్నవి. ఈ గ్రంథములోని విశేషమేమిటంటే యిందులోని సంస్కృతములోని మూలశ్లోకాలు, వాని వెంబడే ప్రతియొక్క దానికి సరళమైన వివరణా, గీతాతత్వాన్ని తెలిసికొని యిహపరాలు రెంటిలోను సుఖపడాలనే ఆసక్తి, భగవత్చింతలను ప్రోత్సహించుచుండుటయే. భగవద్గీత భారతీయులకే కాదు యావత్ప్రపంచానికి వెలుగునిచ్చే దివ్యజ్యోతి. గీతా తత్వముయొక్క మహదోద్దేశాన్ని యీ గ్రంథముద్వారా తెలుగువారు తెలుసుకొని ప్రపంచకల్యాణానికి తోడ్పడుదురుగాక! తమ కృషిలో ప్రచురణకర్తలు అభినందనీయులు.

**గీతాకదంబము (ప్రథమ ద్వితీయ దళములు): అనువాదకుడు: శ్రీ గట్టి లక్ష్మీనరసింహ శాస్త్రి, ప్రకాశకులు: సాధన గ్రంథమండలి తెనాలి. గుంటూరు జిల్లా, వెల ప్రతి 1కి రు. 1-4-0**

భగవద్గీత యొక్క ప్రాశస్త్యము మన దేశంలోనే కాకుండా యావత్ప్రపంచమున గుర్తించబడి మానవ జీవితంలో మార్గదర్శకముగా నున్నది. ఈ యుగంలో అట్టి ఆశయములనే గల మరికొన్ని 'గీతలు' భాగవతమున్నగు ప్రాచీన గ్రంథములనుండి సేకరించి గీతా కదంబముగా రెండు సంపుటములుగా వెలువడ జేశారు.

మొదటిదాంట్లో గోపికా గీత, భ్రమర గీత, హంస గీత, భిక్షు గీత, అవధూత గీత, అనునవి కలవు. రెండవ దానిలో ఐలగీత, శ్రుతి గీత, శ్రీరామ గీత, యమగీత, వేణుగీత, యుగళగీత యున్నవి.

సంస్కృత భాషాజ్ఞానం లేనివారు సయితం ప్రాచీన వాఙ్మయంలోని గీతల స్వభావాన్ని స్వరూపాన్ని సామాన్య ప్రజానీకం తెలిసికొనడాని కనువుగా ఆంధ్రానువాదములుగా సాధన గ్రంథ మండలివారు వెలువడజేసి మహోపకారం చేశారు.

**కిన్నెర (జన్మదిన ప్రత్యేక సంచిక) మా కార్యాలయమునకు చేరినది.**

కిన్నెర మాస పత్రిక భారతీయ సాంస్కృతిక వికాసమునకు చేయుచున్న కృషి అపారము. సాహిత్యమును, కళలను ప్రజలకు మరింత అందుబాటులో నుండుటకుగాను 'కిన్నెర' సంపాదకులు అభినందనీయులు.

ఈ జన్మదిన సంచిక షుమారు 200 పేజీలుండి, అనేక అమూల్యములైన వ్యాసములతో చిత్రములతో ఆకర్షణీయమైన త్రివర్ణ ముఖచిత్రంతో చక్కగా తయారయింది. విజ్ఞానవికాసములకుగాను 'కిన్నెర' ద్వారా సంపాదకులు చేయుచున్న కృషికి యీ సంచిక నిదర్శనము. ప్రతులు వలయువారు కిన్నెర కార్యాలయం 18 జోన్స్ స్ట్రీటు, మద్రాసు-1 కు వ్రాసి తెప్పించుకోవచ్చును.



# సంపాదకీయములు

## డాక్టరు హెలెన్ కెల్లర్

అంధ రచయిత్రి, ఉపన్యాసకురాలుగా ప్రఖ్యాతిగాంచిన హెలెన్ కెలర్ భారత దేశానికి పర్యటనకై వచ్చారు. ఈమె తొమ్మిది వారాలుండి గ్రుడ్డివారు, చెవిటివారు, తన వలె వుండువారు ఎదుర్కొనే సమస్యలను ప్రజలకు ఎరుక పరచి, వారికి అవకాశాలను సమకూర్చి వారి జీవితాలను సయితం ప్రయోజనకరంగాను, సుఖ సౌభాగ్యములతోటి రూపొందించ నవకాశముందని నిరూపించనున్నది. ఆమె అంధులను, చెవిటివారి సమస్యలపట్ల చూపుతున్న ఆసక్తి, వారి యుద్ధరణకుగాను చేయుచున్న కృషి ప్రశంసించతగినవి. భారత ప్రభుత్వము వికలాంగులకు కల్పిస్తున్న విద్య, వృత్తి సౌకర్యాలకు ఆమె సూచనలు, సలహాలు మహోపయుక్తం కాగలవు.

## మెరుగైన వైద్య సదుపాయాలు

రెండవ పంచవర్ష ప్రణాళికలో గ్రామాలలో వైద్య సౌకర్యాలను బాగా విస్తరింప చేయడం భారత ప్రభుత్వ లక్ష్యమని ఇండియా ఆరోగ్యశాఖ మంత్రి రాజకుమారి అమృతకౌర్ రాష్ట్ర వైద్య శాఖాధికారుల సమావేశాన్ని ప్రారంభిస్తూ పేర్కొన్నారు

ఇప్పటికంటె మెరుగైన వైద్య సౌకర్యాలను అభివృద్ధి చేయవలసిన ఆవశ్యకతను వివరిస్తూ ఆరోగ్య కేంద్రాలద్వారాను, వ్యాధినిరోధక, నివారణ కార్యక్రమాల సమన్వయం చేయడంద్వారాను ప్రజారోగ్యమును వృద్ధిచేయ బడగలదనియు, అందుకుగాను గ్రామాలలో ప్రజలకు అనువైన వైద్యసహాయం అందుబాటులో నుండుటకుగాను కుటీర ఆసుపత్రులు ఏర్పాటుచేయడమునకు అవసరమయిన వసతులను, సౌకర్యాలను రాష్ట్రప్రభుత్వాలు పూనుకోగలవనే ఆశాభావాన్ని ఆమె ప్రకటించారు.

కేంద్రము చేసినా, రాష్ట్ర ప్రభుత్వాలు తలపెట్టినా యిప్పుడు గ్రామాలలోకల వైద్య సౌకర్యాలు చాల నిరుత్సాహకరంగానున్నవి. గ్రామీణ జీవితంపై ఎక్కువ భాగం ఆధారపడియున్న భారతదేశ పురోభివృద్ధి నుద్దేశించి ప్రజారోగ్య రక్షణకుగాను వైద్య సౌకర్యాలు విస్తృతం కావాలి !

## ఆంధ్రలో పరిశ్రమల అభివృద్ధి

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింద రాజమండ్రిలోని ఆంధ్ర పేపరుమిల్లు అభివృద్ధి, గూడూరులోని పింగాణీ ఫాక్టరీలో ఎలెక్ట్రికల్ ఇన్సులేటర్ల తయారీకి ఏర్పాట్లు, తిరుపతిలోని శ్రీ వెంకటేశ్వర స్ట్రాబోర్డు ఫాక్టరీని పూర్తిచేసి పని ప్రారంభింపచేయడం జరుగాలని ఆంధ్ర ప్రభుత్వము ఉద్దేశించడం అభినందనీయము.

ఇంతకాలమునుండి ఆంధ్ర పేపరు మిల్లులాంటి ఉత్పత్తి కేంద్రాలు మన రాష్ట్రంలో నుండి వానిని స్వప్రయోజనాలకు వినియోగించుకో కలుగడానికి అవకాశాలు విస్తృతంగా లేకుండ యుండియుండటం చాల విచారకరము. భవిష్యత్తులోనైన మన రాష్ట్రంలోని పింగాణి పరిశ్రమల విస్తరణకు ప్రభుత్వము పూనుకొనడం ముదావహము. వీనితో ఉన్నవకాశాలను సద్వినియోగం చేసికొని ఆంధ్ర ప్రజానీకం పారిశ్రామిక సంపదను అభివృద్ధిచేసుకొనడంలో ప్రభుత్వము సయితం సహకరించగలదనే ఆశించవచ్చును.

## శ్రీ జయనామ సం॥ ర ఫాల్గుణ మాసము

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ మార్చి నెల | 16 | బు | అ 60-10 జ్యే 20-32 రా 13-37 |
| | 17 | గు | అ 3-42 మూ 27-5 దివి 23-42 |
| | 18 | శు | న 7-35 పూషా. 32-4 రా 23-3 |
| | 19 | శ | ద 10-40 ఉషా. 36-15 ధ 10-40 రా 16-47 |
| | 20 | ఆ | ఏ 12-46 శ్రీ 39-22 రా 19-40 |
| | 21 | సో | ద్వా 13-42 ధ 41-20 రా 29-32 |
| | 22 | మం | త్ర 13-25 శత 42-5 రా 27-54 |
| | 23 | బు | చతు 11-53 పూభా 41-36 త్యాజ్యాభావః |
| | 24 | గు | ● అమా 9-7 ఉభా ది 4-46. |

### శ్రీ మన్మథనామ సం॥ చైత్రమాసము

| | | | |
|---|---|---|---|
| 1955 సం॥ మార్చి నెల | 25 | శు | శుద్ధపాడ్యమి 5-15 రే 37-15 ది 8-11 అభ్యంగస్నానం నింబకుసుమ భక్షణం సంవత్సరాది పండుగ |
| | 26 | శ | వి 0-27 ఏప్యం 54-49 అశ్వ 33-42 రా 25 53 |
| | 27 | ఆ | చ 48 37 భ 29-35 రా 27-9 |
| | 28 | సో | పం 42 9 కృ 25-5 శేషం-57 |
| | 29 | మం | ష 35-41 రో 20-38 దివి 2 3 రా 3-15 |
| | 30 | బు | స 29 33 మృ 16- 8 త్యా 3-45 |
| | 31 | గు | అ 23-56 ఆర్ద్రా 12-15 అశోకాష్టమి |
| 1955 సం॥ ఏప్రిల్ నెల | 1 | శు | న 19-4 పున 9-1 దివి 28-18 తిథిద్వయం శ్రీరామనవమి |
| | 2 | శ | ద 15-14 పుష్య 6 44 రా 7-4 ధర్మరాజదశమి |
| | 3 | ఆ | ఏ 12-21 ఆశ్రే 5-31 రా 5-5 త్యా 4-0 |
| | 4 | సో | ద్వా 10-45 మ 5-30 ది 25-56 దవనోత్సవం |
| | 5 | మం | త్ర 10-25 పూఫ 6-42 ది 25-28 అనంగ త్రయోదశి |
| | 6 | బు | చతు 11-17 ఉఫ 9-2 రా 30-48 |
| | 7 | గు | ○ పౌ. 13-20 హ 12-38 రా 3 33 |
| | 8 | శు | బ పాడ్యమి 16-18 చి 17-5 రా 1 40 విదియతిథిః |
| | 9 | శ | విదియ 20-6 స్వా 22-19 రా 6-59 శూన్యతిథిః |
| | 10 | ఆ | త 24 27 విశా 28-4 రా 10-32 తదియతిథిః |
| | 11 | సో | చ 29-4 అనూ 34 5 రా 194 |
| | 12 | మం | పం 33 40జ్యే 40-4 త్యాజ్యాభావః |
| | 13 | బు | ష 38-3 మూ 45 49 ది 1-52 |
| | 14 | గు | స 41-51 పూషా 51-1 ది 11-47 |
| | 15 | శు | అ 44-53 ఉషా 55-26 త్యా 4-18. |

Printed & Published by Dr. S. Seshagiri Rao at Lodhra Press, Kesari Kuteeram Ltd.
15, Westcott Road, Royapettah, Madras.
Founder : Dr. K. N. Kesari; Ag. Editor : C. C. Punniah.



ప్రాణాయామం పట్టి
ముళ్ల పరుపుమీద పడు.
కోవడం సన్యాసికే చేతనయితే

# లోధ్ర




సేవించి ఆరోగ్య ★★★
సౌందర్యాలు సంపాదించు
కొంటూ ఉత్సాహంగావుండ
డము ఆమె చేతనవును.
"లోధ్ర" ఋతు దోషాలను
పారద్రోలి ఆరోగ్య సంతోష
సంతానములను సంప్రాప్తింప
జేయును

కేసరి కుటీరం లిమిటెడ్,
రాయపేట, మద్రాస్.

Lodhra Press, Madras-14.